"దేశమంటే మట్టికాదోయి
దేశమంటే మనుషులోయి"

"ఈసురోమని మనుషులుంటే
దేశమేగతి బాగుపడునోయి !"

అదేవిధంగా సమస్తమైన వస్తువులు, ఇతరులను దోచుకొనే పరాన్నభుక్కులుగాక శ్రమజీవులే తమ చెమటతో ఎలా తయారుచేస్తున్నారో అనే విషయాన్ని ఎంత చక్కగా చెప్పారో చూడండి.

"దేశమనియెడి దొడ్డ వృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయి;
నరుల చెమటను తడిసి మూలం
ధనం పంటలు పండవలెనోయి !"

అందుకు కర్తవ్య ప్రబోధాన్నిగూడ ఈ క్రింది విధంగా నిర్ద్వంద్వంగానే చేశారు.

"వెనుక జూచిన కార్యమేమోయి ?
మంచి గతమున కొంచెమేనోయి;
మందగించక ముందు అడుగేయి
వెనుకబడితే వెనుకేనోయి"

కన్యక శీర్షికగల గేయంలో అప్పారావుగారు అగ్ని గుండం ముందు ఆత్మాహుతికి సిద్ధంగా ఉన్న కన్యక చేత వీరరసముప్పొంగే ఉద్బోధ చేయిస్తారు. తన శీలాన్ని హరించబూనుకున్న రాజును కన్యక ఈ విధంగా హెచ్చరించుతుంది.

"కండకావరమెక్కి నీవీ
దుండగం తలపెట్టినందుకు
వుండడా వొకదైవమంటూ
వుండి వూర్కొనునా !"

కన్యక గుమిగూడిన ప్రజలను సంబోధించి

పట్టమేలే రాజు అయితే
రాజునేలే దైవముండడో ?
పరువునిలపను పౌరుషం మీా
కేల గలుగదో! "

పుత్తడిబొమ్మ పూర్ణమ్మలో అదేవిధంగా అప్పారావు గారు, ముదుసలి మొగుడితో కాపురానికి ఇచ్ఛగించక ఆత్మాహుతికి సిద్ధంగా ఉన్న, బంగరు ప్రతిమలాంటి పూర్ణమ్మచేత జాలిగొలిపే ఈ క్రింది మాటలను చెప్పించి, అందరి హృదయాలను కరగించుతారు.

"నలుగురు కూర్చొని నవ్వేవేళల
నాపేరొక తరి తలవండి
మీా మీా కన్నబిడ్డల నొకతెకు
ప్రేమను నాపేరివ్వండి"

ఇక ఇతరుల మనస్సులను గాయపరచకుండా ఆకర్షించే తమ శైలిని గూర్చి అప్పారావుగారే ఈ విధంగా చెప్పకున్నారు.

"ఆకులందున అణగిమణగీ
కవితకోకిల కూయవలెనోయి ;"

అప్పారావుగారి ఉత్తమరచనలను ఉదాత్తమైన భావాలను మృదు మధురశైలినిగూర్చి ఎంత చెప్పినా తనివితీరదు. వారి రచనలను స్వయంగా చదివి అనుభూతిని పొందవలసిందే. ●

"వసంతసేన కంటే మధురవాణి గొప్ప సృష్టి"
—శ్రీ శ్రీ

# గురజాడే ఈనాడు వుంటే

—వి. యస్. రమాదేవి

గురజాడే ఈనాడు వుంటే ఆడజాతిని వెనుకబడ్డ జాతుల జాబితాలో చేర్పించి వుండేవారు. ఆయనే వుంటే గృహిణుల, ముఖ్యంగా మధ్య తరగతి గృహిణుల "వెట్టి చాకిరీ"ని చట్టరీత్యా రద్దు చేయించి వుండేవారు. ఆయనే ఉంటే పారిస్‌లో పడుపువృత్తి మీద జరిగిన అంతర్జాతీయ సమావేశానికి మధురవాణిని మన దేశపు ప్రతినిధిగా పంపి, "ప్రేమ, పెళ్ళి" వీటిలోగల మాధుర్యంమీద తీయగా మాట్లాడించేవారు (కన్యాశుల్కంలో మధురవాణి వాపోతూ ఉంటుంది–అయ్యో! కాపువాని భార్యనై వానిని ప్రేమిస్తూ బ్రతికే బ్రతుకు ఎంత మధురంగా ఉంటుందీ అనుకుంటూ). ఇలా చెప్పుకుంటూ పోతే చాలా ఉన్నాయి. వీటన్నిటికంటె మరొకటుంది. ఆయన కన్యాశుల్కాన్ని గురించే అంత తపనపడిపోయారు. కనీసం కాస్తో కూస్తో ఆడపిల్లల ధర పలికేది ఆయన రోజుల్లో. ఇప్పుడు అమ్మాయి వెల మైనస్ అయి, వరకట్నం (ఎదురు డబ్బు) ఇచ్చుకోవలసినంతగా విలువ పడిపోయిందీ అంటే ఆయన గుండె ఆగిపోయి వుండేది — వరకట్నం నాటకం వ్రాయడం మొదలుపెట్టక ముందే.

ఆయన రచనల్లోని ఆడ పాత్రలు చాలా వరకూ మానసికంగా విమోచనం చెందిన వాటిగానే కనపడతాయి. కన్యాశుల్కంలోనే చూడండి – మీనాక్షి వితంతువు అయివుండికూడా ఏ విధమైన సాంఘిక నిబంధనలకు జడవకుండ రామప్పంతుల్ని పెళ్ళిచేసుకోమంటుంది. అలాగే బుచ్చమ్మ కూడా, అంత అమాయకత్వంలోనూ గిరీశాన్ని, తాను వితంతువైనా, పెళ్ళి చేసుకోవడానికి ఒప్పుకుంటుంది. అలాగే అగ్నిహోత్రావధానులి భార్య తన రెండవ కూతుర్ని లుబ్ధావధానుల కిచ్చి పెళ్ళి చేయడానికిససేమిరా ఒప్పుకోనని ఎదిరిస్తుంది. అలాగే ఆయన వ్రాసిన కథ "మీ పేరేమిటి?" లో మత వైషమ్యాలతో ప్రాణాల మీదకు పరిస్థితులు వచ్చినప్పుడు నాంచారమ్మ అనే ఒక స్త్రీ పాత్ర తన హేతువాదంతో ఎదుటివారిని ఒప్పించి తన మామగార్ని ప్రాణాపాయం నుంచి తప్పిస్తుంది.

ఒక విషయం చెప్పుకోవాలి. ఆయన పాత్రల్ని ద్వేషించలేం, మనల్ని మనం ద్వేషించుకోలేం కనుక. గిరీశాన్నే చూడండి—భావాలు మహా ఉదాత్తంగా వుంటాయి, అతని చేష్టలకు అతని ఆలోచనలకు ఎక్కడా లంగరందదు, వేటిదారి వాటిదే, ఆలోచనలకు ఆచరణకు మధ్య అడ్డుగా నిలబడే మన బలహీనతలు గిరీశంలో మనల్ని మనం వెతుక్కోవడానికి దోహదం ఇస్తాయి.... ఒక్కముక్కలో-బహుళ జనానికి ప్రతినిధి గిరీశం.

ఆయన రచనల్లో ముఖ్యంగా మనకాయన సంఘ సంస్కర్తగా గోచరమవుతారు. మూర్ఖత్వానికీ, మూఢాచారాలకీ గొడ్డలిపెట్టులు ఆయన రచనలు, కథా వస్తువులో, భావంలో ఒక విప్లవాన్ని తీసుకొచ్చారు. దేశమంటే ఉత్తరాన పుత్తుంగ హిమాలయాలు దక్షిణాన హిందూ మహా సముద్రము–ఈ విధంగా ఆలోచనలు సాగిపోయే రోజుల్లో, "దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్" అనే నిర్వచనాన్ని మన కందించారు. సంఘ సంస్కరణ ఆయన ధ్యేయమైతే దానికి ఆయన చేపట్టిన మార్గం సాహిత్యం. ●

# అమరకవి గురజాడ

## —మిక్కిలినేని రాధాకృష్ణమూర్తి

పందొమ్మిదో శతాబ్దం చివరలోనూ ఇరవయ్యో శతాబ్దం ప్రారంభంలోనూ ప్రభవించిన సాహిత్య ప్రవక్త గురజాడ.

తెలుగు సాహిత్యంలో ఒక నూత్నయుగానికి నాంది వాక్యం పలికిన యుగకర్త గురజాడ.

తనది ప్రజాపుద్యమమనీ ఎవర్నీ సంతృప్తి పరచడానికి తన పుద్యమాన్ని విరమించుకోలేననీ గంభీర వాక్కులు పలికిన ధీరుడు గురజాడ.

తన జీవితాన్ని తన సాహిత్యాన్ని తెలుగు జాతికీ తెలుగు భాషకూ అంకితం చేసిన నవ్యాంధ్రసాహిత్య వైతాళికుడు గురజాడ.

అనేక సాహిత్యశాఖల్లో అనేక విధాల ఆదర్శప్రాయాలైన పరివర్తనల్ని సాధించి మనందరికీ మార్గదర్శకులైనారు గురజాడవారు.

పాషాణ హృదయాల్ని కూడా కదిల్చి కరిగించగల కరుణరసాన్ని ప్రతిబింబించే పుత్తడిబొమ్మ పూర్ణమ్మా, జాతీయ గీతాలన్నిటికీ తలమానికమైన దేశభక్తిగేయం కలకాలం నిలబడతాయి. అప్పారావుగారు అపూర్వమైన ప్రతిభాశాలీ, ప్రగతిశీలీ కనుకనే ఆయన రచనలు అంత సర్వకాలీనతనీ సార్వజనీనతనీ సాధించుకో కలిగినాయి.

అప్పారావుగారి కన్యాశుల్కం, ముత్యాలసరాలు, పూర్ణమ్మ, కన్యక మొదలైన పాటలు పండితుల్నీ పామరుల్నీ రంజింపజేశాయి.

తెలుగు నాటక ప్రదర్శనాల ప్రారంభానికి ముందే తెలుగులో వ్రాయబడిన గొప్పనాటకం కన్యాశుల్కం. కన్యాశుల్కంలో ఒక్కొక్క పాత్రలో ఒక్కొక్క వ్యక్తిలో ఒక్కొక్క విశ్వాసాన్నే సాక్షాత్కరింపచేయగలిగారు గురజాడ. కన్యాశుల్కంలో కన్పించినంతటి వాస్తవికత, సజీవమైన సునిశితమైన హాస్యం ఈనాటి నాటకాలలో లేదనడం అతిశయోక్తి కాదు.

కన్యాశుల్కం రచించిన కాలాన్నిబట్టి, ఆరచన ఎంతటి గొప్పదో మనం లెక్కకట్టాలి. ఆనాడు విపరీతమైన సాంఘిక దురాచారాలు విశృంఖలంగా విహరిస్తున్న రోజుల్లో కన్యాశుల్కం వెలువడింది.

ఆనాడు విజయనగరంలో ఆనందగజపతిరాజుగారి సంస్కృత నాటకాలు తప్ప తెలుగుదేశంలో తెలుగు నాటకమంటూ రంగస్థల మెక్కని రోజులు.

గ్రాంథిక భాషా వాదులూ, ఛాందసులూ, పండితులూ ఒక్కుమ్మడిగా వ్యావహారిక భాషమీదా, వ్యావహారిక భాషా వాదులమీదా, సనాతనాచారాలకు వ్యతిరేకంగా పోరాడుతున్న అభ్యుదయ వాదులమీదా దాడి చేస్తున్న రోజులు.

అయితే గిడుగువారి వ్యావహారిక భాషా వాదాన్ని అవునూ అనిపించడానికి అడ్డంపట్టి నిలబడిన ఆనాటి అభ్యుదయ దర్శనీయుడు గురజాడ.

నాటికీ నేటికీ గొప్ప నాటక మనదగిన కన్యాశుల్కంలోని అనేక పాత్రలూ, సన్నివేశాలూ, ఆయన కాలానికి చెందినవే అనడానికి అనేక ఆధారాలున్నాయి.

కన్యాశుల్కంలోని పాత్రల్లో విలక్షణమైన పాత్ర గిరీశం. ఆ పాత్రకు ఆలంబన వేములకొండ సీతారామమూర్తిగారి కుమారుడూ, స్కూలు మాష్టరూ అయిన విష్ణల చలపతిశాస్త్రి ప్రతిబింబమే గిరీశమని అప్పారావుగారే అనేవారట.

అలాగే రామప్పంతులు పాత్రకు, రామప్పంతులు అనే సహజనామంగల రాయవరం కరణం పాలెపు లక్ష్మణరాజు అనే నియోగి మొఖాసాదారుండేవాడట. ఆయన అంగరఖా ధరించి 70 సంవత్సరాల వయస్సులో మీసాలకు రంగు తగిలించి గిరజాల జుట్టుతో నీలిరంగు కళ్ళద్దాలు ధరించి గంభీరంగా వుండేవారట.

అలాగే మధురవాణి పాత్రకు ప్రతిబింబం మద్దెల మహాలక్ష్మి అనే విజయనగరం దేవదాసీ కులానికి చెందిన ఆమె. మంచి గాత్రం గలిగి సంగీత విద్వత్తు లోనూ వీణావాయిద్యంలోనూ నిపుణురాలట.

ఇలా కన్యాశుల్కంలో అన్ని పాత్రలూ సంఘానికి ప్రతిబింబాలైన సజీవమైన వాస్తవిక పాత్రలే. చదువు కున్న వంచకుడుగా గిరీశం, పరమ ఛాందసుడుగా అగ్నిహోత్రావధాన్లు, లుబ్ధాగ్రేసర చక్రవర్తిగా లుబ్ధావ ధాన్లు, సత్యకాలపు మనిషిగా బుచ్చెమ్మ, ఉత్తమ సంస్కారంగల ఉత్తమ జీవిగా మధురవాణి, సౌజన్యా నికి ప్రతీకగా నిలిచిన సౌజన్యారావు, డాబు దర్పాలకు ఆలవాలమైన రామప్పంతులు పాత్ర – ఒకటేమిటి? అన్నీ వాస్తవ జీవిత ప్రతిబింబాలే

కన్యాశుల్కం రచనాకాలం నాటికి కన్యాశుల్కం ప్రాంతీయమైన సాంఘిక దురాచారంగా వ్రేళ్లు పాతు కొని ఉంది. ఆ ఆచారం ఆనాటికీ ఈనాటికీ అంత బలీయంగానే వుంది. ఒక్క కన్యాశుల్కమేగాక ఆనాటి ఛాందస మూఢాచారాల్నీ, ప్రాంతీయ జీవితంలో ఉండే సహజ వాతావరణాన్నీ ప్రగతిశీలిగా, సంఘం యొక్క విశ్వ దర్శనాన్ని దర్శించిన మహా మనీషి గురజాడ

ఆనాడు 1880లో పార్శీ ధార్వాడా కంపెనీలు ఆంధ్రదేశం వచ్చి ఆమూలం నుంచి ఈమూలవరకూ నాటకాలాడడంతో ఆంధ్ర నాటక రంగం ప్రారంభ మైంది. తెలుగు నాటక రంగమంటూ రంగస్థలమెక్కని ఆనాడు, విజయనగరంలో 1880లో సంస్కృత నాటక రంగాన్ని ప్రారంభించి ప్రదర్శనలు జరిపించిన ఆనంద గజపతిగారి ఆదేశంతో వ్రాయబడినదే గురజాడవారి కన్యాశుల్కం. 1897లో వెలువడిన ఈ నాటకం 1919లో దీపావళి రోజున డాక్టరు గోవిందరాజుల సుబ్బారావు, స్థానం నరసింహారావు, పెద్దిభొట్ల చలపతి, ముక్తేవి రామానుజాచారి మొదలైన ప్రసిద్ధ నటులు మద్రాసు వి. పి. హాల్లో ప్రదర్శించారు. ఆ తరువాత నెల్లూరు, కృష్ణా, గోదావరి జిల్లాలలో ప్రదర్శింపబడి నలుగురికీ తెలిసింది కన్యాశుల్కం నాటకం.

కన్యాశుల్కం గొప్ప నాటకం అనడంలో ఎవరికీ సందేహంలేదు. అయితే ఈ నాటకాన్ని ఎక్కువమంది ప్రయోగాత్మకంగా ప్రదర్శించి ప్రజల ముందుకు తీసుకు వెళ్ళలేకపోయారు.

నాటి నాటక సమాజాలు కన్యాశుల్కాన్ని ప్రదర్శిం చక పోవటానికి ఈ క్రింది వివరాలు కొంత కారణం కావచ్చు. ముఖ్యంగా కంట్రాక్టర్ల చేతుల్లో వ్యాపారంతో కూడుకున్న నాటి పౌరాణిక నాటకాలు, అభ్యాసంతో కూడుకున్న కొన్ని సాంఘిక నాటకాలు, అపహాస్యా నికి చౌకబారుతనానికీ ప్రతీకలుగా నిలబడ్డ కొన్ని హాస్య నాటికలూ, ప్రహసనాలూ కారణం కావచ్చు. అందు వల్ల వ్యాపారరీత్యా నాటకాలాడే వారిని అది అంతగా ఆకర్షించలేకపోయి ఉండవచ్చు.

కేవలం రాగయుక్తమైన పద్య నాటకాలకు, వన్సు మోర్లకూ అలవాటుపడిన ప్రేక్షకులను సంగీతానికి ప్రాధాన్యంలేని ఈ నాటకం సంతృప్తిపరచి యుండక పోవచ్చు.

అది కేవలం విశాఖపట్నం జిల్లా కృష్ణరాయపుర ఛాందసుల వాతావరణమూ, వారి ఆచార వ్యవహారాలూ వారి మాండలిక భాషా, గిరీశం మాట్లాడే ఇంగ్లీషూ మింగుడుపడి వుండకపోవచ్చు.

అంతేకాక కన్యాశుల్కం అతిపెద్దది కావడమూ, ఎక్కువ పాత్రలుండటమూ, అతి ముఖ్యమైన కొన్ని పాత్రలను ధరించడానికి సమర్థులైన నటీనటులు లేక

పోవడంతో కన్యాశుల్కాన్ని ప్రదర్శించే సాహసం చాలమందికి లేకపోయి ఉండవచ్చు.

ఆనాడు తెనాలి రామవిలాస సభవారు పట్టుదలగా ఈ నాటకాన్ని ప్రదర్శించాలని ప్రదర్శించి ప్రయోజనాత్మక నాటకమని పేరు తెచ్చుకున్నా, ఆనాటి పౌరాణిక నాటకాల ధాటికి తట్టుకోలేక, ఆర్థిక విజయం పొందలేక వారి ప్రదర్శనలు ఆగిపోయినై.

ఆనాడు పేరుగల పెద్ద నటులే ఈ నాటకాన్ని కొనసాగించ లేకపోవడంతో, మరో సమాజము కన్యాశుల్కం నాటకాన్ని ప్రదర్శించటానికి సాహసించ లేకపోయింది.

గ్రాంధిక భాష పెత్తనం చలాయిస్తున్న ఆరోజుల్లో సహజమైన వ్యవహారికమైన మాండలిక భాషతోపాటు పాత్రోచిత భాషను ప్రవేశపెట్టటం, గ్రాంధిక భాషా వాదుల్లో, ఛాందసుల్లో కల్లోలం రేపి వుండవచ్చు. ఈ నాటకానికి వ్యతిరేకంగా అలాంటివారు దుష్ప్రచారం లేవదీసి వుండవచ్చు.

గురజాడ రచనల్లో ఒక్క దేశభక్తి గేయాన్ని ప్రజల ముందుకు తీసుకు వెళ్ళినంతగా కన్యాశుల్కాన్ని తీసుకువెళ్ళలేకపోయారు. అయితే ప్రగతి శీలురూ చైతన్యవంతులైన అభ్యుదయ కళాకారులూ ఆ నాటకాన్ని భాగాలు భాగాలుగా సాహిత్య సభల్లోనూ, గురజాడ, వీరేశలింగం వర్థంతి సమయాల్లోనూ ప్రదర్శించి ప్రగతి వాదుల ప్రశంసలందుకున్నారు.

అయితే ఈనాడు నూరు సంవత్సరాలకు ముందే నూతన విప్లవాన్ని తీసుకు వచ్చిన గురజాడ కన్యాశుల్కం నాటకం యొక్క గొప్పదనాన్ని ఈతరం వారికి తెలియ చేయాల్సిన అవసరం ఎంతైనా ఉంది. అందుకు నేటి యువతరం పూనుకోవాలి.

●

"అప్పారావుగారి మోపజ్ఞకమైన రసగీతాలను రాయప్రోలు సుబ్బారావుగారందుకొన్నారు. ఆయనచేసిన పని చాలా గొప్పది. ఆ రోజులలో పండితులు అప్పారావుగారి కావ్యాలలో ఉన్న అందం చూడకుండా నిందించారు. సుబ్బారావుగారు వారిగీతి నూత్నత్వం పండితులకు తగిన భాషలో ప్రకటించి భాషను గురించి మాట్లాడ డానికి వీలులేకుండా చేసి ఆ మార్గంలో క్రొత్తదనం పండితుల చేత కూడా గొప్పదనమని ఒప్పించారు."

—విశ్వనాథ సత్యనారాయణ.



# ప్రయోక్తలు - కన్యాశుల్కం

—సముద్రాల గోపాలమూర్తి

గురజాడ అప్పారావుగారిని, కవిగా సంఘ సంస్కర్తగా, కథానిక, నాటక రచయితగా, ముత్యాల సరాల స్రష్టగా, భాషా సంస్కర్తగా గుర్తించి అనేక వ్యాసాలు వ్రాయడం జరిగింది. గురజాడను కొందరు ప్రజా కవిగా, ప్రజల మనిషిగా గుర్తించినప్పుడు మరి కొందరు ఆయన్ని కేవలం "మాష్టరు"గానే గుర్తించడం జరిగింది. గురజాడ గురువని, గురజాడ అడుగుజాడ అని, మహా మేధావి అని అనేక విధాల ప్రశంసించడం కూడ జరిగింది. పై అంశాలను బట్టి అప్పారావుగారు అనన్య సామాన్య వ్యక్తి అని మాత్రం చెప్పకతప్పదు. సామాన్య ప్రజానీకానికి అర్థమయ్యే రీతిలో సునిశిత మైన హాస్యంతో కూడుకుని స్పష్టంగా, సూటిగా తెలిపేటట్టు మనస్సులను కదలించి, కరిగించి కలకాలం చెరగని ముద్ర వేయగల శక్తి అప్పారావుగారి రచనల ప్రత్యేకత.

గురజాడ సమకాలికుల రచనల్ని (ఆంధ్రులవి, ఆంధ్రేతరులవి) పోల్చి చూస్తే వారి కలంలోని బలం, ఆవేదన, ఆరాటం, ఆందోళనా అర్థమౌతుంది. సంఘం లోని మూఢ విశ్వాసాలను, మూర్ఖత్వాన్ని, సంకుచి తత్త్వాన్ని, మోసాన్ని, వాటివల్ల వ్యక్తికి, సంఘానికి జరిగే నష్టాల గురించి వీలైనంత చమత్కారంగా, మనస్సుకు వెంటనే గుచ్చుకునేటట్టు, లేదా కనీసం వాటి గురించి ఆలోచించడానికైనా మనస్సు మళ్ళేటట్టు రచనలు సాగించారు అప్పారావుగారు. ఈలాంటి ఆణి ముత్యాలలో కన్యాశుల్కం ఒక్కటి.

ఏ నాటకాన్ని ప్రదర్శించదలచుకున్నా ప్రయోక్త మొట్టమొదట నాటకంతోపాటు ఆ నాటక రచయిత ఇతర రచనలను క్షుణ్ణంగా చదవడం అవసరం. రచయిత శైలితోపాటు ఆయన చెప్పదలచుకున్న ముఖ్యవిషయం గురించి తెలుసుకోవడం చాలా అవ సరం. ఇది అనుకున్నంత తేలికైన పనికాదు. ప్రయోక్త సృజనాత్మకదృష్టితో నాటకాన్ని ప్రేక్షకుల దృక్పథంతో అర్థంచేసుకొని రచయిత చెప్పదలచు కున్న భావాన్ని నటీనట బృందంద్వారా అందచేయ గలగాలి.

కన్యాశుల్కం నాటకంలో అనేక సమస్యల్ని తీసు కొని చర్చించడం జరిగింది. అయినప్పటికీ, ఎవరెవరికి ఎలా ఇష్టమైతే అలా ప్రదర్శింపబడగలిగే శక్తి scope ఈ నాటకంలో ఉంది. ప్రయోక్త తన అనుభవం, శక్తి, సామర్థ్యాలు, సంస్కారాన్నిబట్టి ఈ నాటకం లోని ప్రత్యేక అంశాన్ని తీసుకొని ప్రదర్శించవచ్చు. కన్యాశుల్కంలాంటి పెద్దనాటకాన్ని యథాతథంగా

4½ గంటలు ప్రదర్శించేదానికన్నా, అందులోని ఒక్కొక్క అంశాన్ని ఎన్నుకొని తదనుగుణంగా రంగాలను, అంకాలను, పాత్రలను edit చేసుకొని, చెప్పదలుచుకున్న అంశాన్ని emphasise చేస్తూ ప్రదర్శించాలి. ఒక విషయాన్ని నొక్కి చెప్పదలుచుకున్నప్పుడు మరొక విషయాన్ని De-emphasise చేయడంలో చాలా జాగ్రత్త వహించాలి. అప్పుడే ప్రయోక్తయొక్క Interpretation, treatment, characterisation ఒక లక్ష్యాన్ని సాధించగలుగుతవి.

నేను కన్యాశుల్కం నాటకాన్ని ఇటీవల ఢిల్లీలో రెండుసార్లు ప్రదర్శించినప్పుడు పైన ఉదహరించిన విషయాలను దృష్టిలో ఉంచుకోవడం జరిగిందని వేరే చెప్పనవసరంలేదు. కన్యాశుల్కం కేవలం హాస్యరస ప్రధానమైన నాటకమేకాక, "A purposeful play with complex plot" అని నా ఉద్దేశం.

సాధారణంగా ఈ నాటకాన్ని హాస్యరస ప్రధాన నాటకంగా మాత్రమే ప్రదర్శించడం జరిగింది. గిరీశంను "హీరో"గా మార్చడం, ఒక్కొక్కసారి రామప్పంతులు "హీరో"గా ప్రదర్శించడంకూడా జరిగింది.

ఎవరైనా మొదటిసారి ఈ నాటకాన్ని చదివినప్పుడు ఇందులో కేవలం రెండు పాత్రలు మధురవాణి, గిరీశం కొట్టవచ్చినట్లు అగుపడతాయి. గిరీశం ఒక Imposter. ఇతరులను మోసగించి తన పని నెరవేర్చుకోవటం ఈ పాత్రలోని ప్రత్యేకత. ఇలాంటి పాత్రను "హీరో"గా మార్చి ప్రదరిస్తే ఆ ప్రయోక్త గురజాడవారిని అర్థంచేసుకోలేదనే చెప్పాల్సివస్తుంది. మధురవాణి సానిది. ఇలాంటి పాత్రకు Flexibilityకి అవకాశం ఎక్కువ. ఈ పాత్రను Central hub లాగా ఉంచుకొని, మోసగాళ్ళు, దగాకోర్లు, పిసినారీలు, మూర్ఖులు, అవకాశవాదులు, ఎలా ప్రవర్తిస్తారో అప్పారావుగారు చమత్కారంగా వ్రాశారు. వారి సునిశిత హాస్యం వెనకాల అజ్ఞానాంధకారంలోని అమాయకత్వం, మంకుతనం, కుళ్ళు, మోసం, వాంఛ, ఈర్ష్య, ద్రోహంలాంటివి పచ్చగడ్డిలో దాగియున్న పాములాగా అణిగి కనపడుతాయి. కావాలంటే "శౌగ్రగాగని వాడు దున్నపోతై పుట్టున్" అనే వాక్యంలోని హాస్యాన్ని ఆనందించి హాయిగా నవ్వి పోవచ్చు, లేదా అందులోని గంభీర సమస్యల్ని అర్థంచేసుకోవడానికి ప్రయత్నించవచ్చు.

మధురవాణి పాత్రలో Dramatic conflict, sequence, purpose స్ఫుటంగా అగుపడుతవి. అందుకుగాను, ఆయా conflict వచ్చే అంకాలను, తదనుగుణంగా edit చేసి ప్రదర్శించాలి.

పైన ఉదహరించిన అంశాలను దృష్టిలో ఉంచుకొని ప్రదర్శించడం జరిగింది. ఔత్సాహిక నాటక బృందాలవారు ఎదుర్కొనే అనేక సమస్యల్ని నేను ఢిల్లీలో ఎదుర్కోవలసి వచ్చింది. అయినప్పటికీ నా Interpretation ప్రకారంగా, నటీనట బృందంతో ప్రదర్శించిన ప్రయోగం, అశేష జనాదరణ పొందినదంటే, అప్పారావుగారి కన్యాశుల్కం కేవలం హాస్య నాటకమేకాక వ్యంగ్యాత్మక, ధ్యేయాత్మక నాటకం అని, అందులో Hidden treasure ఎంత ఉందో స్పష్టమౌతుంది. గురజాడవారి కన్యాశుల్కం గురించిగాని వారి ఇతర రచనల గురించిగాని పూర్తిగా తెలుసుకోవాలంటే ఒక లక్ష్యంతో పరిశోధన జరపడం ఎంతైనా అవసరం.

ఎన్నో గంభీరమైన సమస్యలు కలిగివున్న ఈ మహానాటకాన్ని ఔత్సాహిక బృందాలు ప్రదర్శించటానికి పూనుకోవు. అయినా ప్రయోక్త తన బాధ్యతలను గుర్తించి ఒక నిర్దిష్టమైన అభిప్రాయానికి వస్తే, కన్యాశుల్కం ప్రదర్శించడం అసాధ్యంకాదు. ●



# గురజాడ సమకాలీనత

—మరువాడ రాజేశ్వరరావు

ఈనాటి జీవితం "సూపర్ సానిక్ జెట్" విమానాల వేగం సాధించింది. వినోదం కోసం కావలిస్తే, "పాత" విమానాల్ని పురావస్తు ప్రదర్శనశాలల్లో చూడొచ్చు. సాహిత్యం కూడా ఈనాడు విప్లవ దృక్పథాన్నందుకుంది. ఇరవైయేళ్ళనాటి భావకవిత్వమే బూజు పట్టిపోయింది దాదాపు డెబ్బయియేళ్ళనాడు సాహిత్య సృష్టి చేసిన గురజాడ వారిని మనం యిప్పుడు యెందుకు చర్చించుకోవాలి? గురజాడవారి రచనల్లో "అణుశక్తి" ఉంది. ఆ శక్తిని అర్థంచేసుకున్న కొద్దీ, సాధించతగ్గ మహత్కార్యాలు కొత్తవెన్నో స్ఫురిస్తాయి.

కన్యాశుల్కం ఒక దురాచారంగా యిప్పుడులేదు. పెట్టుబడిదారీ వ్యవస్థలో వరకట్నం కొత్తమూపు వేసుకుంది. బాల్యవివాహాలిప్పుడు లేవు. బలవంతపు పెళ్ళిళ్లు లేవు. మూఢ నమ్మకాలింకా ఉన్నాయి. అవకాశవాదులున్నారు. అమాయకులున్నారు. వాళ్ళని లౌక్యంగా మోసంచేసే వాళ్లున్నారు. గురజాడవారు తీసుకున్న సమస్యల్లో కొన్ని యిప్పుడు లేవు. మరికొన్ని మఱ్ఱి విత్తనం వించి మఱ్ఱిచెట్టులాగా శాఖలు విస్తరించుకున్నాయి. చెట్టు లక్షణాల్ని విత్తనం నాడే గుర్తించి చెప్పిన గురజాడవారి రచనలు అవశ్యం చదవతగ్గవి.

కన్యాశుల్కం నాటకంలో ప్రధానమైన వ్యక్తులు శ్రోత్రియులైన బ్రాహ్మణులు. ఆనాటి సంస్కారానికీ, విలువలకీ వాళ్లు ప్రతినిధులు. వాళ్లెవరూ ధార్మిక విలువల కోసం పాటుపడ్డవాళ్ళు కారు. సంధ్యావందనానికి తిట్లూ, శాపనార్థాలూ, సానికొంపలూ, నాటు సారా, దొంగ జోస్యాలూ, తప్పుడు జాతకాలూ వాళ్ళ నిత్యావసరాలు. పాత విలువలు కుప్పగా కూలిపోయాయి. వాళ్ళ జీవితాల్లో, ఆలోచనల్లో, 'ఆత్మ'ల్లో 'డబ్బు' లేక 'ఆస్తి' ముఖ్యాంశం. లుబ్ధావధాన్లు రెండో పెళ్ళికి ఒప్పుకోడానికి డబ్బాశే కారణం. అగ్నిహోత్రావధాన్లు 'మెరక పొలం పిస్తంతా వాడికిందయిపోతూంది' అంటూ ప్రవేశించి 'నా కడియం పట్టుకుపోయి తాకట్టు పెట్టాడు' అని రామప్పంతులు మీద యేడ్చుకున్నంతవరకూ—మొదటి నుంచి చివరిదాకా డబ్బుమనిషే. రామప్పంతుల్ని, అగ్నిహోత్రావధాన్లు, లుబ్ధావధాన్ల వంటి ఆశపోతుల చేత కోర్టుల్లో దావాలు వేయించి, చంటిపిల్లలకి పెళ్ళిళ్ళు చేయించి, కొంపలార్పి కమీషను పుచ్చుకునే వ్యాపారం. వీళ్ళంతా 'నాటు' మనుషులు. వాళ్ళు చేసే పనులకు నైతిక విలువలూ, తాత్విక వాదనలూ సిద్ధాంతాలూ అద్దుపెట్టుకోడం చేతకానివాళ్ళు. తోలుబొమ్మల్లాగ ఆడ్డమేగాని, ఆడించగల తెలివితేటలూ, సంస్కారం వాళ్ళకి లేవు. ఆర్థిక వాదానికి రామప్ప, ఆదర్శవాదం అనే తొడుగులు తొడుక్కొని అవకాశ

ఆంధ్రా అసోసియేషన్, సౌత్ ఢిల్లీ.

వాదం అనే సంస్కారం అలవర్చుకున్నవాడు గిరీశం. వీళ్ళందరి దురాశలకి బలైపోయిన అమాయకులు వెంకటేశం, బుచ్చమ్మ, మీనాక్షి, సుబ్బి, వెంకమ్మ మొదలైనవాళ్ళు. అన్నీ అర్థంచేసుకుని ఆశ్చర్యంగా ముక్కుమీద వేలువేసుకుని, యేం చెయ్యాలో తోచని మధురవాణి చివరిలో సానివృత్తి మానేస్తానంటుంది. వీళ్ళంతా కలిసి, అనాటి "మద్రి పిత్తనం". విద్యార్థులు ఈ నాటికీ వెంకటేశం స్థాయిలోనే వున్నారు. స్త్రీల సమస్యల్లో అప్పటికీ. యిప్పటికీ చాలా తేడాలున్నా బుచ్చమ్మ, మీనాక్షి, సుబ్బి, వెంకమ్మలని అర్థం చేసుకుంటే, ఈనాటి సమస్యలకి కారణాలు చాలావరకూ తెలుస్తాయి.

మార్క్సిస్టు దృష్టి లేనిదే ఈనాటి సమాజాన్ని అర్థం చేసుకోవడం అసంభవం. గురజాడవారు మార్క్సిజం చదవలేదు. ఆయన ఆలోచనల్లో వర్గ సంఘర్షణ చోటు చేసుకోలేదు. అయినా ఆయన రచనల్లో ఒక ముఖ్యమైన మార్క్సిస్టు లక్షణం వుంది.

మార్క్సిజం తెలియని సంస్కరణవాద రచయితలు, సమస్యల్ని జీవితాన్నించి వేరుచేసి, 'ప్రత్యేకంగా' చూపిస్తారు. ఆ సమస్యలతోనే ఆ రచనలు కూడా నశించిపోతాయి. మార్క్సిజం తెలిసిన రచయితలు సమస్యల్ని సమగ్రమైన జీవితంలో భాగంగా చూపిస్తారు. ఇందువల్ల మారిన జీవితంలో, ప్రత్యేకమైన సమస్యలు సమసిపోయి కొత్త సమస్యలు పుట్టినప్పటికీ కొత్త సమస్యల్ని అర్థం చేసుకోడానిక్కూడా ఆ రచనలు పనికొస్తాయి. కన్యాశుల్కం పుచ్చుకునే దురాచారం ఒకప్పుడు ఉండేదని తెలియని వాళ్ళక్కూడా కన్యాశుల్కం నాటకంలో అనేక జీవిత సత్యాలు తెలుస్తాయి. గురజాడవారిలో ఈ మార్క్సిస్టు దృక్పథానిక్కారణం విశాలమైన దృష్టి, జీవితంపట్ల నిజాయితీ, సాధించదల్చుకున్న సాహిత్య ప్రయోజనానికి కట్టుబాటు, గొప్ప కళాకారుడి కుండే సంయమనం.

గురజాడవారు ఎవరికోసమూ, ఎందుకోసమూ జీవిత సత్యాన్ని మసిబూసి మారేడుకాయ చెయ్యలేదు. తన రచనల్లో జీవిత సత్యానికి పూర్తిగా కట్టుబడ్డ గురజాడవారు "కమిటెడ్" రచయిత. "నాది ప్రజల ఉద్యమం. దానిని ఎవరిని సంతోషపెట్టడానికి వదులుకోలేను"—అనడం కమిట్ కావడం. ఈనాటి రచయితకు మార్క్సిజం తెలిస్తే చాలదు. గురజాడవారిలాగ, ప్రజల ఉద్యమానికి కమిట్ కాగలగాలి. గురజాడ వారిని కమిటెడ్ రచయితగా చెప్పుకోడం కొందరికి నచ్చదు. వాళ్ళకి ఒక సలహా యివ్వాలనిపిస్తుంది.

స్వదేశీ, విదేశీ పత్రికల్లో పెద్ద పెద్ద అక్షరాలతో ఒక ప్రకటన వేసుకోండి .... "యిదివరకు ఎప్పుడూ కమిట్ కాని యిక ముందెప్పుడూ కమిట్ కాదల్చుకోని 'మహాకవి' కావలెను ; కావలసినంత జీతం, కావలసినన్ని సన్మానాలూ, అవార్డులూ ఏర్పాటు చెయ్యబడును. అప్లికేషనుకు ఆఖరి తేదీ అంటూ లేదు." అని. గురజాడవారు బతికొచ్చినా అప్లికేషను పంపించరు.

గురజాడవారు అణుశక్తి నిండిన గొప్ప నాటకం రాసేరు. ఆ తరవాత యింతవరకూ తెలుగులో అంత గొప్ప నాటకం రాలేదు. కనీసం అరవాతిక మందైనా ఆయన స్థాయిని చేరుకుంటే తప్ప ఆయన రచనలు 'పురా' వస్తువులు కావు. రేపటి కవులు కూడా బూజు పట్టిపోయే సుమార భవిష్యత్తులో కూడా గురజాడవారు సజీవంగా రచయితల్నీ, పాఠకుల్నీ ఆకర్షిస్తూనే వుంటారు. జీవితంలో మనం యిప్పుడు ఊహించలేని మార్పులెన్నో జరిగి ఒకవేళ ఆయన రచనలకి కాలం చెల్లిపోయినప్పుడు కూడా, 'కమిట్' అయిన కవిగా ఆయన జనం గుండెల్లో 'శాశ్వతం'గా ఉండిపోతారు.

ఆయన నిన్నా, యివాళా, రేపూ కూడా 'సమకాలికుడు.'

●

# మొట్టమొదటి కన్యాశుల్కంలో మధురవాణి

—పురాణం సుబ్రహ్మణ్య శర్మ

మొట్టమొదటి కన్యాశుల్కం నాటకాన్ని 1892 ఆగస్టు నెలలో విజయనగరం జగన్నాధవిలాసినీ నాటక సమాజంవారు ప్రదర్శించారు. ఆ నాటకాన్ని 1897వ సంవత్సరంలో "శ్రీ విజయనగరము శ్రీ విజయరామ విలాస ముద్రాక్షరశాల యందు కొంకిపూడి భద్రయ్యచే ముద్రింపబడి ప్రకటింపబడియె. దీని వెల ౮ అణాలు. అంచెకూలి ౧ అణా" అని వుంది. ఈ నాటకాన్ని "శ్రీ విజయనగరరాజ్యమున పాచీన లిపి పాఠకుడగు గురజాడ అప్పారావు పంతులు బి. ఎ. చే రచియింపబడినది" అని వ్రాశారు. ఇది ఐదంకాల నాటకం. ఈ నాటకంలో ఇరవై ఎనిమిది, చతుర్థాంకంలో సారాదుకాణం దృశ్యం కలిపి ఇరవై తొమ్మిది దృశ్యాలు. అప్పారావుగారు నాటకంలో అంకాలను స్థలము అని విభజన చేశారు. (ఇప్పుడు మనం దృశ్యాలుగా విభజిస్తున్నాం.)

జాగ్రత్తగా పరిశీలించి ఈ కన్యాశుల్కం (1897) ప్రతిలో మధురవాణికిగల ప్రాముఖ్యాన్ని మనం బేరీజు కట్టవలసివుంది.

పాత్రల పరిచయంలో స్త్రీ పాత్రలలో "వెంకమ్మ, బుచ్చమ్మ, మీనాక్షి"ల తరవాత "మధురవాణి" నాల్గవ స్త్రీ పాత్రగా ఆఖరుస్థానం అలంకరిస్తుంది. ఆమె పేరు కెదురుగా "రామప్పంతులుంచుకొనిన సాని" అని మాత్రమే వుంది. ఆ 1897 నాటకంలో ఆమెకు రామప్పంతులు సానిగానే తప్ప నాటక చక్రాన్ని తిప్ప గల చక్రపాణిస్థానం ఆమెకు లేదు. ఆమెకు గిరీశంతో ఎట్టి సంబంధం లేదు. గిరీశం వుంచుకున్న సాని "మహాలక్ష్మి". ఆమె కన్యాశుల్క కథకు కీలక మయిన సుబ్బి (అగ్నిహోత్రావధాన్లు చిన్నకూతురు) లానే అప్రవేశపాత్ర. మహాలక్ష్మి: మహారాజా ఆనంద గజపతి హయాంలో విజయనగరంలో "మహాలక్ష్మి" అని మహా గొప్ప సంగీత విద్వాంసురాలైన వేశ్యా రత్నం వుండేది. ఆవిడ విజయనగరాన్ని తన విద్వత్తుతో, చమత్కారంతో, సరస సంభాషణా చాతుర్యంతో యేలింది అని చెబుతారు. ఆవిడ మహారాజావారి ఆస్థానంలో వున్నా, వారు పాడమన్నా పాడేది కాదట. ఆమె పాడినప్పుడే ఎవరైనా వినాల్సిందేనట. సాయంత్రం చీకటి కనుమరుగయేవేళకు ఆదిభట్ల నారాయణదాసుపంటి హేమా హేమీలతో సహా ఆమె యింటివద్ద హాజరయి కల్వంలో భంగు పత్తి నూరుతూ, ఆమెకు చేదోడువాదోడుగా వుంటూ కనిపెట్టుకునేవారట. ఉండీ ఉడిగి ఆమె ఓ రాగం, ఓ కీర్తన, ఓ పల్లవి విసిరితే పట్టుకుందామని. (ఈమెను మద్దెల మహాలక్ష్మి అనికూడా పిలుచుకునేవారు.) గురజాడవారు, మహాలక్ష్మి యింటికి వెళ్లారో లేదో మనకైతే తెలీదుకాని, ఆమె పెంకితనానికి చిన్న చురక తగిలించేలా, మొట్టమొదటి కన్యాశుల్కంలో 'మహాలక్ష్మి'ని గిరీశానికి సానిగా "రిఫర్" చేశారు. దాన్తో కొంపలంటుకుపోయి రెండవ కన్యాశుల్కం నాటికి ఆ వేశ్యా రత్నం పేరును వుపసంహరించుకోవలసి వచ్చింది. అదీ ఒకందుకు మేలే అయింది. గిరీశానికి కూడా మధురవాణే ప్రేయసి అయికూర్చుంది.

మొట్టమొదటి కన్యాశుల్కంలో ప్రధానమైన స్త్రీ పాత్రలు వెంకమ్మ, బుచ్చమ్మ, మీనాక్షి. ఆ నాటకానికి అనాఘ్రాత పుష్పం, అమాయకురాలైనది విధవ 'బుచ్చమ్మ' వృత్తి కథానాయిక. ఈ నాటకం వ్రాయడానికి ప్రేరణ యిచ్చింది ఆనందగజపతి మహారాజా. అయితే వారు 1897 లో మరణించారు. ఆయన అరటి పిలకనే చూశారుకాని పూర్తిగా గెలవేసిన అరటిచెట్టును చూడలేదు. గురజాడ విశ్వరూపాన్ని ఆనందగజపతి చూడలేకపోవడం ఒక గొప్ప దురదృష్టం! ఈ నాటకం మొదటి యంకములో స్త్రీ పాత్రలు వెంకమ్మ, బుచ్చమ్మ మాత్రమే. "ద్వితీయాంకము" రెండవ స్థలములో మధురవాణిని ప్రవేశపెట్టారు అప్పారావుగారు. రామప్పంతులు స్టేజిమీద వుండగా మధురవాణి ప్రవేశించి-

"బుద్ధావధాన్లుని పెళ్ళికి యాలా వొప్పించారేమిటి?" అని అడుగుతుంది.

ఈ దృశ్యంలో ఆమెకు ముచ్చటగా మూడు డైలాగులు వున్నాయి: "బుద్ధావధాన్లుకు పెళ్ళి చెయ్యడం మీ కోసమే"నని ఓ పాయింటు రామప్పంతులు మీదకు విసుర్తుంది. అయితే, యీ చిన్న సీన్లో రామప్పంతులు "మైడియ్యర్" అని మధురవాణిపై ఇంగ్లీషులో సంబోధన విసురుతాడు. ఈ రెండో అంకంలోనే నాల్గవ స్థలములో కరటకశాస్త్రిలు శిష్యుడు స్త్రీ వేషములో ప్రవేశించినపుడు రామప్పంతులు ఇంట్లో (మధురవాణి పేరు చెప్పకుండా) సాని ప్రవేశించి "నమస్కారమండీ పంతులుగారూ" అంటుంది కరటకశాస్త్రితో. (నియోగులను మాత్రమే పంతుళ్ళనాలి) కరటకశాస్త్రి "ఇవ్వాళ్ళకి జన్మ సాఫల్యమయినది. నన్ను పంతులుగారిని చేశావా" అంటాడు. అద్దం పట్టమన్నంటే సాని తెచ్చియిస్తుంది రామప్పంతులు మీసాలు సవరించుకోడానికి. ఈ దృశ్యంలో ఒక్క డైలాగు మాత్రమే వుంది. వ్యవహారమంతా రామప్పంతులు, కరటకుడూ మాట్లాడుకుంటారు మధురవాణి వృత్తి సాని, డమ్మీమాత్రమే.

మళ్ళీ తృతీయాంకము ఏడవ స్థలములో కాని మధురవాణి రాదు. "అప్పటికి బుద్ధావధాన్లు" పెళ్ళయిపోయింది. రామప్పంతులు మధురవాణి కంటె తీసుకుపోయి శిష్యుడు గుంటకి పెట్టేశాడు. ఇప్పుడిక్కడ ఏడవ దృశ్యంలో "కంటె తేలేదని" రామప్పంతుల్ని ఇంట్లోకి రానివ్వకుండా బయట నిలబెట్టి తలుపులు వేసుకుంటుంది.

"నాకు వొళ్లు మండుతూంది ఖబడ్దార్" అంటె మధురవాణి పెంకెగా "మీకు వొళ్లు మండుతూంటే గాల్లో నిలబడితె చల్లబడుతుంది" అని జవాబిచ్చి తలుపులు మూస్తుంది.

స్త్రీలకు గల తలుపులు మూసే మూసుకునే హక్కును (Erotic గా వూహించినా) అప్పారావుగారు గుర్తించారిక్కడ. తలుపు దగ్గర పార్వతీదేవి శివుణ్ణి, కృష్ణుణ్ణి సత్యభామా నిలబెట్టడం స్త్రీల పాటలు విన్నవారందరికి చక్కగా గుర్తే! 1897 నాటకంలో రామప్పంతులు క్రయిసిస్‌లో పడ్డానికి, తన లౌక్యాన్నంతా బుద్ధిపై ప్రయోగించడానికి మధురవాణి కంటె రేపెట్టింది. ఈ రచనలో మధురవాణి కంటెకు వున్న ప్రాముఖ్యం ఆ పాత్రకు లేదు. (అయితే తృతీయాంకము, మూడవ స్థలము బుద్ధావధానులు యింట్లో రామప్పంతులు లేకుండా పెళ్ళయాక, రామప్పంతుల్ని ఫూల్ చేసినందుకు అతడ్ని ప్రసన్నం చేసుకుందుకు లౌక్యులంతా నాలుగు ఘడియల పొద్దుకు వస్తారుగదా యేమిటి చెయ్యడం?" అని రామప్పంతులు అడగ్గా "యేమీ తోచకుండా వున్నది. తమరే చక్రం అడ్డువెయ్యాలి" అని బుద్ధుడు అడిగినప్పుడు – దర్జాగా పంతులు "కానియ్యి మేజువాణి పెడదాము. మధురవాణికి రాత్రులకు కంట్రాక్టుగాని పగలు రావడముకు ప్రసక్తం లేదు. దానికి ఇందుకు వేరే ఇస్తేనేగాని కుదరదు." అని మధురవాణిని రిఫర్ చేస్తాడు. మేజువాణీ పేరిట సానికి కొంత డబ్బు బుద్ధావధాన్లుచేత యిప్పించడం, పెళ్ళయిపోయాక వచ్చినవారిని ఎంగేజ్

చేయడానికి మధురవాణి ప్రోగ్రాం ఏర్పాటుచేయడం రామప్పంతులు "చక్రం"లో భాగం.)

చతుర్థాంకంలో ఆరవస్థలము చివర్లో,రామప్పంతులు కంచె తగూలో ఇరుకునపడి – బుద్ధావధాన్లు "కంచె" యివ్వనందుకు చెరువుగట్టున దిగిన అగ్నిహోత్రుడ్ని రెచ్చగొట్టి బుద్ధుడ్ని తన్నడానికి పంపిస్తాడు. కాని యితని పరిస్థితి 'ఇంటికి వెళ్ళితే కంటికి తిపులాట తప్పదు. వెళ్ళకపోతే కనిష్టీబు ప్రవేశిస్తాడేమో బెంగ' అని పిక్కులో పడతాడు. అదే అంకం ఏడవ స్థలములో– రామప్పంతులు పిలవగానే 'అయ్యో' అంటుంది. 'మీరు నన్ను సార్లా చెయ్యరు – నేను నూతిలో బడిపోతాను' అని యేడుస్తుంది. మధురవాణి ఏడవటమా ? జితులు తెలిసిన సాధారణ వేశ్య మాత్రమే మధురవాణి. అయితే పెంకితనం, ఏడిపించే గుణం, మాటకు మాట బదులు చెప్పే నేర్పు ఈ మధురవాణిలోనూ లేకపోలేదు. ఈ డైలాగు చూడండి :

రామ : కాళ్ళు పట్టుకుంటాను నన్ను రక్షించి యేలాగైనా ఈమాటు కాపాడు.

మధు : ఆ కంచె యెవర్తెకిచ్చావో దాని కాళ్ళే పట్టుకో (అని తన్నివేయును.) (మీతో ప్రారంభించి ఏకవచన ప్రయోగానికొచ్చింది.) బహుశా పారిజాతాపహరణంలో ముక్కుతిమ్మన 'నను భవదీయదాసుని' ఘట్టం జ్ఞాపకంవచ్చి మధురవాణిచేత రామప్పంతుల్ని తన్నించారు. ఇక ఈ నాటకంలో మధురవాణి మరి రాదు. ఈ నాటక కథలో మధురవాణి రామప్పంతులు వుంచుకున్న వేశ్య మాత్రమే. ఆమెకు వృత్తిగుణం చేత కనిష్టీబు. ప్లీడరు నాయుడు వగైరాలతో సంబంధాలున్నాయి. ప్రదమాంకము, పంచమాంకాల్లో ఆమెకు ప్రవేశంలేదు. మూడు అంకాల్లోనూ, కంచెకు సంబంధించిన పేచీలో వస్తుంది. ప్రవేశిస్తూనే "మీ మాటలు నాకు తెలియవా యేమిటి ? బుద్ధావధాన్లుకు పెళ్ళిచెయ్యడం మీ కోసమే. అందుచేత నాకు మనస్కరించకుండా వున్నది." అని మనసులోని అనుమానాన్ని తెగేసి చెబుతుంది. ఈనాటకంలో మధురవాణికి కరటకశాస్త్రిల్లు శిష్యుడికి ఆడవేషం వేసి తెచ్చిన సంగతి తెలియదు. కంచెమాత్రం ఎరువిచ్చింది. అది పోయినందుకు రామప్పంతుల్ని తలుపులు వేసి లోనికి రానివ్వక, వచ్చి కాళ్ళుపట్టుకుంటే ఆఖరికి తన్నింది.

ఈ పాత్ర పరిధి కుంచించుకుపోయింది. మొత్తం కన్యాశుల్కం నాటకాన్ని విష్ణుచక్రంలా గిరగిరత్రిప్పిన మధురవాణి ఈ మధురవాణి కాదు. ఇది పేలవమైన పాత్ర. అయితే హేయమైనా అసహ్యించుకోదగిన పాత్రకాదు. రెండవ కన్యాశుల్కంలో మధురవాణి వసంతసేనను మించి ఎదిగింది. అప్పారావుగారి మానససరోవరంలో పూచిన సహస్రదళ వికసితపద్మం. అక్షరాలా కథానాయిక మధురవాణి :

అప్పారావుగారు 1909 లో ముని సుబ్రహ్మణ్యం గారికి వ్రాసిన ఒక చరిత్రాత్మక లేఖలో మధురవాణి గురించి వ్యాఖ్యానిస్తూ మొదటి ప్రతిలో మధురవాణి Colorless iniquity అన్నారు. దీనికి అవసరాల సూర్యారావు తన సహజ పాండిత్యం జోడించి "మొదటి కూర్పు కన్యాశుల్కంలో మధురవాణి వర్ణించలేని హేయమైన నడవడిక గలది. ఆ పాత్రకి ఎట్టి వన్నెలూ చిన్నెలూ లేవు" అంటూ అప్పారావుగారు అనని మాటలను అన్నట్లు జోడించి ఆయన కొంప ముంచాడు. సూర్యారావు అసమర్థత తెలియక, ఆ వాక్యాలను అప్పారావుగారివనుకుని ఆరుద్ర ప్రమాదంలోపడి 'మొదటి రచనలోగల మధురవాణి పాత్రపైన నాటకాన్ని రాసిన అప్పారావుగారికే సద్భావంలేదు' అని వ్రాశారు.

సూర్యారావు చేసిన తప్పుడు అనువాదం వలన ఆరుద్రవంటి సమర్థులుకూడా పొరబడటం జరిగిందని నేను భావించాను. దీనికి ఆరుద్ర జవాబు ఈ క్రింద ఉటంకిస్తున్నాను.

"నేను అప్పారావుగారిని కోట్ చేస్తున్నాననుకొని అవసరాలను కోట్ చెయ్యలేదు. గురజాడ రచనలు

5వ సంపుటం లేఖలు ప్రథమ ముద్రణ జులై 1958. నేను కోట్ చేసిన వ్యాసం మొదటి ముద్రణ (పరిశోధనలో) డిసెంబరు-జనవరి 1956. నేను కోట్ చేసింది గురజాడకు చలం చేసిన తర్జుమాలోంచి. పరిశోధన అభోజ్ఞాపికలో ఆ సంగతి చెప్పాను. బంగోరె నా వ్యాసం రెండవ ముద్రణలో అది తొలగించాడు. మీరు బాధ్యతగల విమర్శకుల్లా మరికొంచెం శ్రద్ధగా నేను కోట్ చేసినదీ సూర్యారావు అనువాదాన్ని పరిశీలిస్తే నేను వేరే అనువాదం చేసుకున్నాననో, ఇంకొకరిది వాడుకొన్నాననో తెలిసేది. 'నాటకం రచిస్తున్నకొద్దీ మధురవాణి పాత్రపట్ల నాకున్న దృక్పథం మారుతూ వచ్చిందని చెప్పక తప్పదు' అని కోట్ చేశాను. అవసరాల అనువాదంలో "...... దృక్పథంమారుతూ వచ్చింది" అని మాత్రమే వుంది. ఈ చిన్న తేడా మీకు "క్లూ" యిచ్చేది. నా వ్యాసంలో వాడిన కోట్స్ అన్నీ చలం తర్జుమానుంచే!

ఆరుద్రగారు చలంగారినుంచి కోట్ చేసినట్లయితే, సూర్యారావుకూడా చలం అనువాదాన్నే కోట్ చేశాడా చిన్న మార్పులతో అనే అనుమానం కలుగుతుంది. గురజాడ సుబ్రహ్మణ్యంగారికి వ్రాసిన లేఖలు సూర్యారావు సేకరించాడు. సూర్యారావుకి ముందు ఆ ఉత్తరాలను చలం ఎలా అనువాదం చేయగలిగాడు? చలంగారు కన్యాశుల్కాన్ని "కుళ్ళుపుస్తకం" అన్నారట. ఈ విషయమైవారికి వ్రాయగా ఇలా జవాబిచ్చారు.

'ఆ కన్యాశుల్కం ఆ నాటక కర్తను
ఎప్పుడో మరచిపోయాను...

ఈశ్వరాశీర్వాదాలతో,

18-3-1976 చలం.

ఎవరు ఎవరిని కోట్ చేశారు, చలం వ్రాసినట్లు చెప్పబడుతున్న అనువాదంలోని వాక్యాలు, అవసరాల చేసినవి ఒకేలా ఎలా వున్నాయి అనే అంశాలను శ్రద్ధగా పరిశీలించాల్సివుంది. ఆరుద్ర వ్యాసం 1956లో వస్తే 1958లో లేఖల సంకలనం వచ్చినందున వారు వీరిని కోట్ చేయాల్సిన పరిస్థితి ఏర్పడదు.

ఈ వివాదాన్ని వదిలేస్తే- Colorless iniquity- మొదటి కన్యాశుల్కంలో గురజాడ వ్రాసిన దానికి "హేయమైన నడవడికకలది" అనే అర్థం చలం చెప్పినా, సూర్యారావు చెప్పినా అది సరికాదు.

1906 లో విజయరామ గజపతికి వ్రాసిన ఉత్తరంలో నిజజీవిత చిత్రణ చేసే నాటకంలో సంభాషణలు గ్రాంధికంలో వ్రాస్తే పలకపని అంటూ గురజాడ - I wonder why authors invariably draw their plots from old world romances when the present was full of variety and intense life. So I wrote in colloquial Telugu and invented an improbable plot, to hang over to it sketches of court life. The book was successful beyond my expectation. There my mission ended ప్రాణాలు.

ఇందులో అప్పారావుగారు స్వయంగా తాను ,'Invented an imporbable plot, to hang on to it sketches of court life'' అని ఎందుకు అన్నారంటే - శిష్యుడికి ఆడవేషం వేసి ఆ పిల్లను లుబ్ధావధాన్లుకిచ్చి పెళ్ళి జరిపించడం, తద్వారా సుబ్బి పెళ్ళి తప్పించడమనేది ఒక "అసంభవమైన ప్లాట్"ని దానికితోడు కొట్టు సీనులు కల్పించి ఆ జీవితాన్ని యథాతథంగా చిత్రించడం జరిగిందని అప్పారావు ఒప్పుకుంటూ తన విజయాన్ని విజయరామరాజు దృష్టికి తెచ్చాడు. ఈ ఉత్తరంలో ప్రస్తావన మొదటి కన్యాశుల్కం గురించే.

(రావిశాస్త్రిగారి వ్యాఖ్యాం ప్రకారం మొట్టమొదటి కన్యాశుల్కంలో మధురవాణి Colorless iniquity అంటె "అందంలేని పాపం"గా వుండెను. అందంలేని పాపం రెండు నాటకాల్లోనూ మధురవాణికాదు రామప్పంతులు, అందమైన పాపం - మధురవాణి.)

కన్యాశుల్కం నాటక బీభత్సంలో మధురవాణి, ఆమె మెడలోని కంటె, మృచ్ఛకటికంలో వసంతసేన, ఆమె ఆభరణాలతో నిండిన మట్టిబండి రెండూ సమంగా తూగి నాటకాన్ని రక్తికట్టించాయి. కాగా, 1897 కన్యాశుల్కంలో మధురవాణి కంటె కున్న ప్రాముఖ్యం మధురవాణికి లేదని మనవి చేశాము. అందుకే ఆమె ఆ నాటకంలో "అందంలేని పాపం"గా మిగిలిపోవలసి వచ్చింది. మరొక సంగతి-మొట్టమొదటి కన్యాశుల్కం ప్రాసేనాటికి గురజాడపై మృచ్ఛకటికం ప్రభావం యెంతమాత్రమూ లేదు. 1905 లో ప్రకటించిన The Little Clay Cart by Arthur William Ryder చదివాక అప్పారావుగారు శూద్రకుడ్ని కొంచెం కోప్పడి చారుదత్తుడు లేని వసంతసేనను కళింగ రాజ్యంలో సృష్టిస్తానని పంతంపట్టి "మధురవాణిని" మలిచారు.

"సాంఘిక జీవనం కథావస్తువులో ప్రతిబింబిత మగునట్లు రచితి మయిన నాటకం ఆ కాలమందు ఎక్కువ ఆకర్షంగా వుంటుంది. సంఘజీవితం మారి ఆ కథా వస్తువునకు సంఘంలో ఆస్కారం లేనప్పుడు ఆ నాటకం ఆకర్షంగా వుండను. హేమ్లెట్ నాటకం షేక్స్పియరు రచించిన నాటకాలలో ఉత్తమోత్తమయినా ఈ కాలంలో దానియెడల ఆదరం తగ్గింది. అల్లే కన్యాసుల్కం సంఘంలో అంతరించింది. వరసుల్కం అమలులో ఉంది. ప్రభుత్వంవారు దీనిని తొలగించటానికి చట్టం నిర్మించినా రహస్యంగా సాగుతూనేవుంది. పరిస్థితులు తారుమారయినా కన్యాసుల్కం జనరంజకంగానే ఉన్నది. అందుకు కారణం లేకపోలేదు. అప్పారావుగారు సార్థకములు కాగల పాత్రలు సృష్టించారు. వాటికి అమరత్వం సిద్ధించింది. షేక్స్పియర్ రచించిన నాటకాలలో షైలాక్, ఇయాగో, రోమియో, ఫాల్ స్టాఫ్, క్లియోపాత్రా వంటి పాత్రలు గిరీశం, అగ్నిహోత్రావ ధానులు, లుబ్ధావధానులు, రామప్పంతులు, మధురవాణి పాత్రలు లోకంలో ఆయా గుణములు గలవారికి పెట్టదగిన పేర్లయినవి."

—గిడిగు వెంకట సీతాపతి

(తెలుగు నాటక రంగం కళావని ప్రచురణ నుండి)

# నవ కవయిత గురజాడ

ఇలపావులూరి పాండురంగరావు.

తనువు తావని భ్రమించక తనతోటి వారిలో తన్ను దాను చూచుకో గలగటం ఒక తపస్సు. అలాంటి తపస్సంపన్నత కలవాడే కవి, మనీషి. మనీషి ఐన కవి దృష్టికి మట్టికూడా మనిషిలా కనిపిస్తుంది. అతని సృష్టిలో తోకచుక్క-కూడా వేగుచుక్క-లా వెలుగుతుంది. అతని నోట వెలువడే మాటలు కలకాలం నిలబడ గలిగే మంత్రాలుగా మారుతాయి. ఈ తపస్స్వాధ్యాయ నిరతుల కోవకు చెందిన మహామనస్వి శ్రీ గురజాడ వేంకట అప్పారావు. ఆయన్ని మహాకవి అనేకంటే "కవయిత" అంటే బాగుంటుందని తోస్తుంది.

అసలు ప్రపంచమంతా ఒక మహాకావ్యం. దీనిని రచించిన విరించి మంచిని పెంచిన మహాకవి. ఈ మహాకవి ప్రకటించే మహావాక్య సరణిని అనుసరించి చరించే ప్రతి చైతన్యమూర్తి కూడా కవి పదవికి అర్హుడే. అయితే ఇందులో కొంతమంది చూచింది చూపిస్తారు, విన్నది వినిపిస్తారు, వ్రాసింది వ్రాయందీ వ్రాయిస్తారు. అలాంటి వారినే కవయితలు అనాలని అనిపిస్తుంది. కవి కర్త అయితే కవయిత కారకుడవుతాడు. కాని దీనికి దృష్టి, సృష్టి, పుష్టి కావాలి. ఈ మూడు గుణాలూ గురజాడవారి వ్యక్తిత్వంలో పుష్కలంగా కనిపిస్తాయి. గతాన్ని నిశితంగా పరిశీలించటంలో ఆయన దృష్టి, వర్తమానాన్ని సమర్థంగా నిర్వచించటంలో ఆయన సృష్టి, అనాగతానికి అభిలషిత ఫలితాన్ని అందించటమే తన ఆదర్శంగా భావించి ఆనందించటంలో ఆయన పుష్టి — మనకు స్పష్టంగా గోచరిస్తాయి. పదిమంది వెళ్ళే దారిలో వెళ్ళుతూనే వాళ్ళకు సరికొత్త బాటను చూపించి "క్రొత్త పాతల మేలు కలయికను" కూర్చిన మహా మనస్వి కావటం వల్లనే ఆయన్ని నవ కవితకు కవయితగా భావించటం భావ్య మనిపిస్తుంది. నిజానికి ఆయన రచయితలను రచించిన మహా రచయిత.

అప్పారావుగారి పేరు వినగానే మనకు మూడు మాటలు స్ఫురిస్తాయి. దేశం- ప్రేమ- మంచి. ఇవి మూడూ ఆయన తన జాతికి ప్రసాదించిన మంత్రత్రయి. వీటినే "దేశమును ప్రేమించుమన్నా, మంచి అన్నది పెంచుమన్నా," అనే ముత్యాలసరంలో ఆయన కూర్చి ఇచ్చారు. దేశమంటే ఆయనకు కనిపించేది ఒట్టి మట్టి కాదు. ఆ మట్టిలో పుట్టి, మట్టితో పెరిగి, మట్టి పట్టినా మనఃకాంతంగా భాసించే మనుష్యులే హిరణ్య తేజస్సుతో ఆయనకు కనిపిస్తారు. "దేశమంటే మట్టి కాదోయ్, దేశమంటే మనుషులోయ్" అన్న వారి నిర్వచన సూత్రానికి "మనుషులంటే మనసులోయ్" అన్నది సరియైన వార్తికం అవుతుంది. ఈ మనుష్యుల మనస్సులు ఎలా ఉండాలోకూడా ఆయన నిరూపించారు. "ఒట్టిమాటలు కట్టిపెట్టి, గట్టి మేల్తలపెట్టే" దిట్టలే దేశానికి పనికొస్తారని ఆయన గట్టిగా నొక్కి- చెప్తారు. తిండి ఉంటేనే కండ, కండ కలవాడే మనిషి-అని ఆయన నిర్మోహమాటంగా అనేస్తారు. నిజమే మరి. ఊసురోమని మనుషులుంటే దేశమెలా బాగుపడుతుంది? "నాయమాత్మా బలహీనేన లభ్యః" అన్న వేదవాక్కు-ను గురజాడవారు సూటిగా చెప్పారు. వేద నిహితమైన సందేశాన్ని అందంగా ఆస్వాద్యంగా అధునాతన మానవజాతికి అందించటమే నవ కవయిత ఆశయం. కనుకనే "ఆకులందున అణగి మణగి కవిత కోయిల పలక వలెనోయ్" అంటాడు, మాట మంచి

తెలిసిన మానవ కవి. ఇక్కడ ఆకులంటే పశువులు కొరుక్కుతినే మామూలు ఆకులు కావు, కవి కోకిలలు ఏరికోరి ఆరగించే ప్రశస్త వేద పర్ణాలు. సామాన్య మానవుడి కంటే అరాకులు, పది పన్నాలు ఎక్కువ చదువుకున్న భావుకుడు కావటంవల్లనే కవి గురజాడ ఇలా చెప్పగలిగాడు. కవి చెప్పినంత మాత్రాన లాభం లేదు, అది విని అర్థం చేసుకునేందుకు అర్హులుకూడా ఉండాలి. "పలుకులను విని దేశమందభిమానములు మొలకెత్తవలెనని" కవి కాంక్షిస్తాడు.

కవి కాంక్షించిన సమాజంలో జాతి, మత, వివక్ష ఉండదు. జాతి ఒకటే, అది మానవజాతి. మతం ఒకటే, అది మానవత్వం. భాషలు వేరయినా పరిభాష అందరికీ ఒక్కటే, అది ప్రేమ. ప్రేమ సూత్రంలో మానవుల మనస్సుమనాలను కూర్చి ముత్యాల మనోహర సరాలతో ఆంధ్ర జాతిని అలరించిన కవి గురజాడ గొప్ప వాఙ్మయ తపోధనుడు. ఈ ప్రేమను కవి గొప్ప పెన్నిధిగా భావిస్తాడు. అది కొరుక్కుతినేది కాదట. నేర్చుకుంటే నేర్చు రాదట. శాస్త్రాలుకూడా ఈ విషయంలో మౌనం వహించాయట. కవుల కృప వల్లనే ఈ ప్రేమ రహస్యం తెలుస్తుందట. స్త్రీ పురుషుల జీవితాన్ని తరింపచేసేది ప్రేమ ఒక్కటే అని కవి నమ్మకం.

మగువలకు మగవారి కొక్కటె
బ్రతుకు సుకముకు రాజ మార్గము.

అది ఎలా పెంపొందుతుందో కవి భావన వివరిస్తుంది:

ప్రేమ నిచ్చిన ప్రేమ వచ్చును
ప్రేమ నిలిపిన ప్రేమ నిలుచును.

ఈ రెండు వాక్యాలు ప్రేమ సమీకరణాల్లా విలసిస్తాయి. నిజానికి, "ధర్మో రక్షతి రక్షితః" అన్న సనాతన సూక్తిని అధునాతన పదజాలంలో అందించాడు కవి ఈ పంక్తుల్లో. కవి ప్రేమకు ఆధారం శరీరం కాదు, మనస్సు కూడా కాదు. హృదయం దానికి ఆలవాలం. హృదయంలో ఉదయించి, హృదయంలో పెరిగి సమస్త మానవ జాతికి జాతి కుసుమాలను అందించి వాటి పరిమళాన్ని నలుదిక్కుల వెదజల్లే పరమ పావన మనోభావన కవి కోరిన ప్రేమ. అది వయసుతో మరలిపోయే మరులు కాదు. మాయ మర్మంలేని నేస్తాన్ని కవి తన జీవిత సమస్తంగా భావిస్తాడు. ఇలాంటి ప్రేమనే మహాకవి భవభూతి ప్రశంసిస్తూ అంటాడు :

అద్వైతం సుఖ దుఃఖయో రనుగుణం
సర్వాస్వవస్థాసు యత్
విశ్రామో హృదయస్య యత్ర జరసా
యస్మిన్న హార్యో రసః

ప్రేమకు రెండు అనేది తెలియనే తెలియదట. రెండు కలిసి ఒకటి కావటమే ప్రేమపరమార్థమట. కష్టసుఖములలో అది సమానంగా పెరుగుతుందట. హృదయం విశ్రాంతి తీసుకునేందు కది ప్రశాంతి నిలయమట. అది వయసుతో తరగదట. ఇలా భవభూతి అడుగుజాడల్లో గురజాడ ఎలా తొంగి చూస్తున్నాడో సహృదయులు గమనించగలరు.

ప్రేమ నిండిన మనస్సుకో కవి తన మాటల మూటను కాసుల మూటగా కవితాకన్య కప్పిస్తాడు. ఆత్మ తత్త్వం ఆత్మశక్తితో ఆత్మనే చేరుకుంటుందని కదా ఉపనిషత్ సిద్ధాంతం ; అలాగే కవయిత తన కవితను కవితా సతికే అర్పించి కృతకృత్యుడవుతాడు.

మహాత్ముడు బోధించిన ప్రేమనే ఆయనకు దాదాపు సమకాలీనుడైన గురజాడ మనకు మరో విధంగా చూపించాడు. "లవణ రాజు కల" అనే ఖండికలో హరిజన పక్షపాతి అయిన కవి హృదయం చండాల బాలికలో నిండు మనసును తిలకిస్తుంది. పుట్టుకతో మాల అయినా మలిన వృత్తులను మానివేసి నిర్మలమైన పల్లె జీవితం గడిపే ఒక అందమైన పిల్లపై అందాలలో తులతూగే మహారాజుకు మనసవుతుంది. కాని వాళ్ళ సహజమైన ప్రేమను సంకుచితమైన

సంఘం అంగీకరించదు. కలలో చూచిన అందాన్ని ఇలలో సాక్షాత్కరించుకొని కూడా దానితో అనుబంధం ఏర్పరచుకొని ఆనందించేందుకు వీలులేని లవణ రాజు తనకు నచ్చిన పతితో పాటు చితిలోపడి బ్రతుకు లక్ష్యాన్ని చేరుకుంటాడు.

"కలుగు భవములు కూడ నీతో
కలసి గడపుచు ముక్తి చెందెద
కలదె నీ ప్రణయాతిరేకము
కన్న సద్గతియున్."

అనుకుంటూ ప్రేయసీ ప్రియులు పరమ హంస ధ్వనితో ప్రణయ గీతిని ముగిస్తారు. ఇదంతా కల. కాని లవణరాజు కల కూడా నిజమవుతుంది. మహారాజు నిజంగా మాలపిల్లనే పెండ్లి చేసుకుంటాడు. దీనితో మహాత్ముడు కన్న కలకూడా గురజాడ వారి ఋషి వాక్కులో నిజరూపం దాలుస్తుంది. నిద్ర లేచిన రాజు "పటు విషాద సమాకులేక్షణుడై" తన అనుచరులతో అంటాడు :

"పుస్తకంబులలోని మాటలు
విస్తరించుచు అనుభవమ్ముల
తత్త్వ మెరుగక శుకములగుదురు
వొట్టి శాస్త్రజ్ఞుల్."

"విషాద సమాకులేక్షణ" శబ్దం తేట తెలుగుకు పాటుపడే గురజాడ వారి నోట వెలువడటం కొంత వింతగా తోస్తుంది. అసలు సమాస మంటేనే ఆయనకి గిట్టదు. చివర 'వొట్టి శాస్త్రజ్ఞుల్' అనేకంటే "శుష్క శాస్త్రజ్ఞు" లంటే ఎంతో చక్కగా ఉండేది. కాని సర్వ సామాన్యంగా అందరికీ అర్థం కావాలన్న ఆశయానికి కట్టుబడ్డవాడు కాబట్టి "వొట్టి" మాటకే వోటిచ్చాడు. మరి అలాంటి కవికి ఇలాంటి సమాసం ఎలా రుచించింది అనేది ఆలోచించవలసిన విషయం. నిజానికి ఈ మూడు మాటల్లో భగవద్గీతలోని విషాద యోగం, ఆదికవి రామాయణంలోని విషాద గాథ, అసలు జీవిత యాత్రలో అడుగడుగున జడిపించే విషాద రేఖలూ, ఈ మూడూ ముసురుకుని వినిపిస్తాయి. ఏక కాలంలో ఇన్ని విషయాలు చెప్పాల్సి వచ్చేసరికి కవికి సమాస ప్రయాస తప్పిందికాదు.

ఒక్కొక్కసారి కవి మనస్సు ప్రబంధకాలంనాటి పుష్పలావికల మీదికి పోతుంది. పూదండల నమ్ముకొనే పూబోడితో సరసంగా ఒక రసికుడంటాడు :

"నీ దండ చిక్కు వడెనే
నా దండను చిక్కుటన్న నగరే ప్రాజ్ఞుల్,
నీ దండ నుంచుకొనుమా
వాదడుగు మటంచు రచటి వనితలు
విటులన్."

ఈ కందంలో వనితలూ, విటులూ ఒకరిని మించి మరొకరు వాగ్వైదగ్ధతను చూపిస్తారు. దండనూ, అండనూ మేళవేసి మలిచిన యమక ప్రాసల్లో ప్రాచీన కవితాధోరణిపై కవికి గల మమకారం కనిపిస్తుంది. "ప్రీతి కలదేని జాతులు చూతురే ? మా జాతులెల్ల చోద్యము లనరే ?" అన్న పంక్తుల్లో కవి దాదాపు నాలుగు శతాబ్దాలు వెనక్కిపోయి కూడా కనీసం ఒక శతాబ్దం ముందు మాట చెప్పగలిగాడు.

నీలిగిరి పాటల్లో కవికి ప్రకృతి మీద ఉన్న సహజానురాగం గోచరిస్తుంది. "ఊటి చోద్యమేమి చెపుదు"నని సాటిలేని ఊటిని మాటల్లో మూటగట్టి చూపిస్తాడు – కాసుల మొనగాడు, మన గురజాడ.

గురజాడ కూర్చిన ప్రేమలో త్యాగం ప్రధాన లక్ష్యంగా కనిపిస్తుంది. 'కన్యక' అనే ఖండికలో విషయ లాలసుడయిన రాజు దృష్టి ఒక సామాన్య వైశ్య కన్యపై పడుతుంది. నడి వీధిలో పద మదాంధుడైన ప్రభువు పరిణయ పరాధీన అయిన కుల కన్యను కలుష నయనాలతో చూస్తాడు. ఆమెను తాత్కాలికంగా స్వాధీనం చేసుకోవాలని చూస్తాడు. ధర్మపరాయణ అయిన కన్య అతన్ని దేవి ఆలయానికి తీసుకొనివెళ్ళి

అక్కడ చితిలో ప్రవేశిస్తూ తనమీద నిజంగా ప్రేమ ఉంటే తనతోపాటు ఆ చితిలోపడి లయం కమ్మని అతనితో సవాలు చేస్తుంది. అప్పుడు పట్టణమేలే రాజు గర్వం కరిగిపోతుంది. కోట పేటలు కూలి తుక్కలకు, నక్కలకు ఆటపట్టైపోతాయి. కాని మానవతి అయిన కన్య మంటకలిసిన చోట ఆకాశాన్ని అంటే ఆలయం లేస్తుంది.

ఇలాంటి త్యాగపూరితమైన అనురాగాన్నే 'డామన్ పితియస్' అనే ఖండిక కూడా వివరిస్తుంది. డామన్, పితియస్ అనే ఇద్దరు యవన మిత్రులు ఒకరి క్షేమం కొరకు మరొకరు ప్రాణాలను సైతం అర్పించేందుకు సిద్ధమవుతారు. మరణదండన పొందిన డామన్ ప్రాణాలు వదిలేముందు భార్య, బిడ్డలను చూద్దామనుకుంటాడు. కాని దీనికి ప్రాణానికి ప్రాణం ఒడ్డే ఆప్త మిత్రుడు కావాలి. అందుకు పితియస్ సిద్ధపడతాడు. నెలలోగా డామన్ తిరిగి రావాలి. లేకుంటె పితియస్ దక్కడు. ఇలాంటి క్లిష్ట పరిస్థితిలో డామన్ మాట దక్కించు కుంటాడు. ఇద్దరు మిత్రుల అపూర్వ త్యాగానికి రాజు ముగ్ధుడై మరణదండన కొట్టివేస్తాడు. ఈ కథ అందరికీ తెలిసిందే, కాని కవి దాన్ని తన మాటల్లో చెపుతుంటే అదో సొంపుగా ఉంటుంది. అసలు కథ చెప్పటమే ఒక నేర్పు. ఆ కథను హృద్యమైన భాషలో పద్యరూపంలో కూర్చటం అందరికీ సాధ్యమయిన పనికాదు. వ్యాస వాల్మీకులు సాధించి నిరూపించిన బాట ఇది. ఆ ఋషుల అడుగుజాడల్లో గురజాడ ఈ నైపుణ్యాన్ని పరిపూర్ణంగా అలవరుచుకొన్నారు. "పుత్తడి బొమ్మ పూర్ణమ్మ కథ"లో ఈ నేర్పు కళా ప్రపూర్ణతను పొందింది.

తెలుగు దేశం, తెలుగు భాష, తెలుగు జాతి నిల కడగా ఉన్నన్నాళ్లు పుత్తడి బొమ్మలా పూర్ణమ్మ నిలిచి పోతుంది. గురజాడవారి మాటనూ, మనసునూ, మంచినీ రంగరించుకొని బంగారు కాంతితో పొంగి పొరలే మంగళగీతి ఇది. ఏయే వేళల పూచే పువ్వుల ఆయావేళల అందించి, ఏయే ఋతువుల పండే పండ్లను ఆయా ఋతువుల అందించి, ఏయే ఋతువుల్లో పండే పండ్లను ఆయా ఋతువుల అందించి, బంగరు దుర్గను భక్తితో కొలిచే" పుత్తడిబొమ్మ పూర్ణమ్మ తెలుగువారి నోములపంట. అన్నపూర్ణమ్మకు ఆలయమైన ఆర్ష భూమిలో పేదరికానికి బలిఅయిన పూర్ణమ్మ కరుణ గాథ బండ హృదయాలను కూడా కరిగిస్తుంది. ఆమె కన్నుల్లో కళకళలాడే కాంతులు కలువలను చేరుకున్నాయి. ఆమె మేని పచ్చదనం మేలిమిలో మిళితమైపోయింది. ఆమె నడకల్లోని ఒయ్యారం రాయంచల అడుగు మడుగుల్లో ఒదిగి పోయింది. ఆమె దుర్గలో చేరి దుర్గగా మారి పోయింది. తనతోపాటు తన కవయితను కూడా మృత్యుంజయుణ్ణి చేసింది.

కథ చెప్పినా, కవిత వ్రాసినా గురజాడ రచనల్లో ముఖ్యంగా నాటకీయ సజీవత తొణికిసలాడుతుంది. 'సుభద్ర' అనే ఖండికలో ఈ లక్షణం విలక్షణంగా కనిపిస్తుంది. కృష్ణుడు తన ప్రాణ మిత్రుడైన అర్జునుడికి తన చెల్లెలు సుభద్రను జత కూర్చటంలో చూపిన లాఘవం, చాతుర్యం ఈ కమనీయ కళా ఖండంలో ఎంతో చక్కగా చిత్రించటం జరిగింది. రచన పద్యరూపంలో ప్రబంధ ధోరణిలో సాగినప్పటికీ సంభాషణలు, సంఘటనలు, సన్నివేశాలు- అన్నీ నాటక లక్షణాలకు అనుగుణంగా కనిపిస్తాయి. సర్గ విభజన కూడా అంక విభజన లాగానే స్ఫురిస్తుంది. గురజాడ వారిలో ఒదిగివున్న ఈ నాటక రచనా పాటవం "కన్యాశుల్కం"లో పూర్తిగా వికసించింది. గురజాడ వారి కీర్తి పతాకను తెలుగునాట కలకాలం నెలకొల్ప గలిగిన పతిష్ఠమైనరచన "కన్యాశుల్కం". సంస్కృతంలో 'మృచ్ఛకటిక'కు ఉన్న స్థానం తెలుగులో ఈ ఒక్క నాటకానికే లభించింది.

అప్పారావుగారు ఎక్కువగా వ్రాయలేదు. కవిత మరీ స్వల్పం. కాని పరిమితిలో కొంచెమయినా, పరిణతిలో అనల్పమైనది వారి కావ్య సాధన. ముత్యాల సరం అనే ఛందస్సు వారి నూతన సృష్టి కాకపోయినా, దానికి ఆ పేరు పెట్టి కొత్త కొత్త పోకళ్ళలో దాన్ని

మలచటం గురజాడవారి ఛందస్సాధనకు ప్రబల నిదర్శనం. రగడ జాతిలో ఈ ఛందస్సు అంతకు ముందు వాడుకలో ఉంది. కాని కొద్ది మార్పులతో దాన్ని సరికొత్త ఛందస్సుగా తీర్చి దిద్దినవాడు గురజాడ. హిందీలాంటి భారతీయ భాషల్లో కూడా దీనికి ప్రచారం ఉంది. కాని ముత్యాల సరాల పోకడ అతి విలక్షణంగా ఉంటుంది. పంక్తి చివర తెగిపోకుండా అవిచ్ఛిన్నంగా కొనసాగే తెనుగు పదాల జాలుకూడా ఈవిసర్గ శోభకు బాగా సహకరించింది.

అసలు ఛందస్సు వల్ల సాధించవలసిన పరమార్థ మేమిటి? కవిత్వానికి ఛందస్సు ఎంతవరకు అవసరం? ఏ భావానికి, ఏ కాలానికి ఎలాంటి ఛందస్సు సరిపోతుంది? అనే విషయాలను కూలంకషంగా పరిశీలించినప్పుడు గురజాడవారి ముత్యాలసరాలలోని ఛందస్సాధన బాగా బోధపడుతుంది. అది ప్రత్యేకమైన పరిశోధనకు అనువైన విషయం. ప్రస్తుతం ముత్యాల సరాలతో తెలుగు తల్లిని అలంకరించి అలరించిన గురజాడవారి అర్ష దృష్టిని, దివ్య సృష్టిని అభినందించ గలిగితే చాలు.

గురజాడవారి సృష్టి కంటె వారి దృష్టి గొప్పది. వారు వ్రాసినదంతా తీరికగా కూర్చుంటే ఒక గంటలో చదివి ముగించవచ్చు. ముఖ్యంగా కవిత్వం ఆయన చాలా కొద్దిగా వ్రాశారు. కాని ఆ కొద్దిలోనే ఆయన యుగ యుగాలకు సరిపోయే చైతన్యాన్ని కుదించి మన కందించారు. తన యుగానికి, తన జాతికి, తాను తరించి తనతోటి వారిని కూడా తరింప చేసేందుకు కావలసినంత వాక్సంపదను ఆయన మనకు ప్రసాదించారు. సముద్రంలో ఎంత నీరున్నా మనకు దాహం తీర్చలేని అనంత జలరాశి వల్ల మనకు ప్రయోజనం లేదు. అమృతం ఒక్క చుక్క చాలట - జన్మ జన్మాంతరాల దాహం తీర్చుకునేందుకు. అలాంటి అమృత బిందువులు కానీ, వాటిని తాగిన అమరులు కానీ మనకు మృగ్యులు. కాని గురజాడవారి వచనామృతం మాత్రం మనకు లభించింది. ఇది మన అదృష్టం. ●

"ఒక మనుష్య స్త్రీ, అప్పలకొండయమ్మ, తన సొంతానికి ప్రయివేటు శక్రటరీగా వాడుకోగా, సరిగా ఆ సమయంలోనే వొక దేవతా స్త్రీ, సరస్వతీదేవయమ్మ బహుళాంధ్ర కోసం మహాకవిగా తీర్చిదిద్ది, ఆధునికాంధ్ర సాహిత్య సామ్రాజ్యంలో కిరీటమాంధాతను చేసింది."

—శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి.

"ఆదికాలంలో తిక్కన, మధ్యకాలంలో వేమన, ఆధునిక కాలంలో గురజాడ మన తెలుగులో మహాకవులు." —శ్రీ శ్రీ

# అవీ ఇవీ

—అబ్బూరి గోపాలకృష్ణ

పంధొమ్మిది వందల అరవైమూడు అక్టోబరు ఇరవయ్యో తారీకున శ్రీ చక్రవర్తుల తాతాచార్యులు గారిని వారింటివద్ద కలుసుకొన్నాను. అప్పటికి ఆయన వయస్సు 84 సంవత్సరాలని ఆయన చెప్పారు. అంత కన్నా ఎక్కువేమో ననిపించింది ఆయన్ని చూస్తుంటే. ఆయన అప్పారావుకి చాలా సన్నిహితులు. ఆ విష యాన్ని శ్రీ గురజాడ రామదాసుగారుకూడా చెప్పారు.

ఆవేళ నాతోపాటు ఎ. యస్. రామారావూ, నిడద వోలు సుందరేశ్వరరావూకూడా ఉన్నారు. మేం ముగ్గురం గురజాడను గురించిన వివరాల సేకరణకై పద్దెనిమిదో తారీకునుంచీ విజయనగరాన్ని గాలిస్తున్నాం. మాటల సందర్భంలో శ్రీ గురజాడ రామదాసుగారు చెప్పిన సంగతినిబట్టి శ్రీ తాతాచార్యులవారి ఆచూకీ దొరికింది.

శ్రీ తాతాచార్యుల వారింటికి వెళ్ళేసరికి ఆయన కుమారులు ఆదరంగా మమ్మల్ని ఆహ్వానించి తండ్రితో చెప్పారు. శ్రీ తాతాచార్యులుగారు తెల్లని ధోవతీ కట్టు కుని బనీను వేసుకుని ఉన్నారు. దబ్బపండువంటి శరీర చ్ఛాయ. ఆయన మాటలు చాలా అస్పష్టంగా ఉన్నాయి. మధ్య మధ్య ఆయన కుమారులు మాకు అర్థమయ్యే ట్టుగా అనువాదం చేయాల్సి వచ్చింది.

"అప్పారావుగారిని గురించి మీ దగ్గర తెలుసుకో వలసినవి చాలా ఉన్నాయి అని వచ్చాం" అన్నాను నేను. "రాజు దగ్గర నాకే బాగా చనువుండేది" అన్నా రాయన. రాజు అనే పేరుతో ఆయన అప్పారావు గారిని పిలిచేవారట. ఆ రోజుల్లో అప్పారావును చూసి అంతా భయపడేవారు అన్నారు. ఆనందగజపతితోనూ తర్వాత అప్పల కొండయాంబ, లలితకుమారీదేవుల తోనూ ఆయనకున్న పరిచయాన్ని చూసి భయపడేవారట.

అప్పారావుగారితో యేదన్నా ఇబ్బంది కలిగించే విష యాలు ప్రస్తావించవలసివస్తే తాతాచార్యులుగారి ద్వారా ప్రస్తావించేవారుట చాలామంది. ఇద్దరూ "ఏం వోయ్" అనే పలకరించుకొనేవారట.

"అప్పారావుగారు వీణ వాయించేవారని విన్నాను బాగా వాయించేవారా ?" అని అడిగాను. తనకు తెలిసి నంతలో సాధారణంగా ఆయన చేతులు వణుకుతూండే వనీ ఆయనకు నరాల బలహీనత తీవ్రంగా ఉండేదనీ అన్నారు. వీణ వాయించడం అంటే చాలా ముచ్చట పడేవారనీ, అప్పుడప్పుడు వాయించినా చేతులు వణకడం వల్ల ఆటంకం కలిగేదనీ అన్నారు.

నేను : ఆయన పాడేవారనికూడా విన్నాను ?

ఆయన: నేను ఆయనపాడగా వినలేదు. పాటఅంటే ముచ్చట పడేవాడు. కూనిరాగాలు తీయడం నే నెరుగు దును. ఆయన గొంతు కీచుగా బలహీనంగా ఉండేది.

అప్పారావుగారితో కలిసి ఫొటో ఏమీ తీయించుకో లేదా అని అడిగాను. ఆయనకి ఫొటోలమీద మోజు లేదనీ ఇప్పటివరకూ ఫొటో లేకుండానే గడిపారనీ ఆయన కుమారులన్నారు. నేను నా కెమెరాతో ఫొటో తీశాను. నాది అంత మంచి కెమెరాకాదు. ఆవేళ పెద్ద వర్షం కురుస్తోంది. మేం కూర్చున్న గదిలో ఆట్టే వెల్తురులేదు. ఫొటో సరిగా రాలేదు.

ఒకసారి ఊటీలో అర్ధరాత్రి పన్నెండు గంటలకు అప్పారావు లేచి "తాతా ! తాతా! నేను చచ్చిపోతు న్నాను, పోతున్నాను" అంటూ పెద్ద ఆక్రందనతో తాతాచార్యులవారిని లేపారట. ఆయనలేచి కోకోవైనూ, కాఫీ యిచ్చిన తర్వాత కొంతసేపటికి అప్పారావు కోలుకున్నారట.

అప్పుడప్పుడు అప్పారావును ఎగతాళి పట్టించడానికి తాతాచార్యులుగారు నూతిపీడు ధర్మ అప్పారావు గురించి బైరాగులు పాడుకొనే పాటను పాడుతుండే వారట. ఓసారి అనుకోకుండా తాతాచార్యులవారు ఊటీ వెళ్ళారట. అప్పుడు అక్కడ చలి విపరీతంగావుందట. ఎండాకాలంలోకూడా ఉన్ని బట్టలు ధరించే గురజాడ తన దగ్గరున్న కొన్ని ఉన్ని కంబళీలను ఇచ్చి, కొన్ని లడ్లు ఫలహారంగా ఇచ్చారట. అప్పుడు తాతాచార్యులు గారు నవ్వుతూ

"ఖానేకూ లాడూ దియా రాజా ధర్మ
అప్పారావ్
ఛడ్నేకు దుప్‌టీ దియా రాజా ధర్మ
అప్పారావ్"

అంటూ పాట పాడారట. అప్పుడు గురజాడ అన్నారట— "ఇదేమిటయ్యా ఈ దరిద్రుణ్ణి పట్టుకుని ఆ ప్రభువుతో పోలుస్తావ్? అయినా నువ్వెళ్ళేటప్పుడు ఆ కంబళీ లన్నీ ఇచ్చివెళ్ళు. నేనేం ధర్మ అప్పారావును కాను. దానం చెయ్యలేను" అని. ఈ విషయాన్ని చెబుతూ తాతాచార్యులుగారు పకపక నవ్వారు.

"విజయనగర సంస్థానానికి చాలామంది పెద్ద పెద్ద పండితులూ, కవులూ వచ్చేవారటకదా! వాళ్ళ పాండిత్యాన్ని రాజసభలో పరీక్షించేటప్పుడు అప్పారావు గారి విశేషాలేమన్నా చెప్పగలరా?" అని అడిగాను. అలాంటివాటిలో అప్పారావు యెక్కువగా జోక్యం చేసుకునేవాడుకాదని చెప్పారు.

"మరి తిరపతి వేంకట కవులలాంటి కవులు వచ్చి నప్పుడు ఆయనేం మాట్లాడేవారుకారా? అప్పారావు గారు కూడా కవేకదా?" అని అడిగాను.

"ఇప్పుడు మీరందరూ కవి అంటున్నారుగాని ఆ రోజుల్లో మా రాజును కవంటే యెవరూ ఒప్పుకోక పోను. అసలు అతని కవిత్వాన్నిగానీ పాండి త్యాన్నిగానీ యెవరూ పట్టించుకోలేదు. రాజుకూడా సంస్థాన వ్యవహారాలతో సతమతమౌతూ ఉండేవాడు" అన్నారు తాతాచార్యులుగారు.

అప్పారావుగారితో యేదన్నా అభిప్రాయభేదం వచ్చి తాతాచార్యులుగారు వివాదపడితే "వోయ్ తాతా! జాగర్త! నీ మీద పద్యం రాస్తాను ఊరుకోకపోతే" అని బెదిరించేవారట అప్పారావుగారు.

అప్పారావుగారు చనిపోవడానికి కొద్ది దినాలముందు ఆయన మంచంపక్కన కూర్చుని చాలాసేపు మాట్లాడా రట తాతాచార్యులుగారు. యేం మాట్లాడారని అడిగితే యెంతో ప్రయత్నించికూడా జ్ఞాపకం తెచ్చుకోలేక పోయారు.

యనమండ్ర నారాయణమూర్తిగారు కూడా అప్పారావుగారికి సన్నిహితులే అనీ, అయితే ఆయన దగ్గర తనకున్నంత చనువు నారాయణమూర్తికి లేదని అన్నారు తాతాచార్యులుగారు.

చాలాసేపు కూర్చుని మాట్లాడటంవలన తాతా చార్యులుగారు బాగా అలిసినట్లు కనిపించింది. ఆయన కుమారుడు కూడా అన్నాడు ఆయన పడుకునేవేళ అయిందని. మేం ఇంకా ఆయన్ని కష్టపెట్టడం ఇష్టం లేక సెలవు పుచ్చుకున్నాం.

యెన్నో అడగాలనుకున్న ప్రశ్నలు అలాగే వుండి పోయాయి. ఆయన వయస్సు మళ్ళినందువల్ల జ్ఞాపకం తెచ్చుకోడానికి కూడా చాలా శ్రమ పడుతున్నారు. అసలు ఆయన్ని కలుసుకుని మాట్లాడగలగటమే మహా భాగ్యమనిపించింది నాకు.

• • •

అదేసంవత్సరం అదేరోజున నేను శ్రీ యనమండ్ర నారాయణమూర్తిగారి కుమారులు శ్రీ సాంబశివరావు గారిని కూడా కలుసుకొన్నాను. ఆయన ఆ వేళ చాలా పనిలో ఉన్నప్పటికీ తీరిక చేసుకుని ఒక గంటసేపు నా కోసం వినియోగించారు. శ్రీ యనమండ్ర నారా యణమూర్తిగారూ, అప్పారావుగారూ కలిసి తీయించు

కొన్ని ఫొటోలను ఆయన చూపించారు. నారాయణ మూర్తిగారికి అప్పారావుగారంటే మంచి భక్తి గౌరవాలున్నట్టు ఆ ఫొటో సూచిస్తోంది. ఈ ఫోటోను చూసి శ్రీ శాతాచార్యులుగారు అప్పారావుతో "నీ పక్కన నిలబడిన ఈ బట్లర్ యెవరు?" అని చేసిన యెగతాళికూడా వాళ్ళ ముగ్గురిమధ్యా వుండే సాన్నిహిత్యాన్నే ప్రకటిస్తుంది. ఆ ఫోటోను ఊటీలో 1910 లో తీయించుకొన్నారు.

యనమండ్రవారికి అప్పారావుగారిలాగే డైరీలు రాసుకునే అలవాటుంది. అవి అప్పారావుగారి డైరీల కన్నా బాగా విపులంగా ఉన్నట్టు సాంబశివరావుగారు చెప్పారు. ఆ డైరీలను ప్రచురిస్తే బాగుంటుందేమో అన్నాను. అయితే మహారాజావారి కుటుంబ వ్యవహారాలే యెక్కువగా ఉన్నందువల్ల ఆ పని సాధ్యంకాదని అన్నారు. ఆనాటి విజయనగరపు వాతావరణమన్నా ఆ డైరీల ద్వారా మనం గ్రహించవచ్చుకదా! ప్రచురణ విషయం దయచేసి ఆలోచించండని చెప్పాను. అప్పారావు సంగతులు కనీసం కొన్నైనా ఆ డైరీలలో ఉండకపోవని నా ఆశ.

• • •

రామదాసుగారు (అప్పారావు కుమారులు) నేను సంపాదించిన కొన్ని ఫోటోలను. 'సారంగధర' కాపీని ఎంతో సంతోషంగా స్వీకరించి ఆదరంగా మాట్లాడారు. అప్పారావుగారి ఫోటో (Profile) నూ, నీరసంగా ఒక కుర్చీమీద కూర్చున్నట్టున్న ఫోటోనూ ఒక ఇటాలియన్ (చిత్రకారుడూ, ఛాయా చిత్రకారుడూ కూడా) తీసి 'రీటచ్' చేశారట. అప్పారావుగారు ఇంటి సంగతి విషయమై రాసుకొన్న లేఖను శ్రీ రామదాసుగారు నాకు బహూకరించారు. భక్తితో అందుకొన్నాను.

అప్పారావుగారు కళ్ళద్దాలను వాడేవారు. ఆ బంగారపు కళ్ళద్దాలు ఇంకా ఉన్నాయని శ్రీ రామదాసుగారు చెప్పారు.

అప్పారావుగారు బొమ్మలు గీస్తుండేవారు. ఆయన గీసిన కొన్ని స్కెచ్‌స్‌ను రామదాసుగారు శ్రీ సెట్టి ఈశ్వర్రావు గారికివ్వగా అవి ఆయన నిర్లక్ష్యంవలన పోయినవి అన్నారు.

• • •

పంథొమ్మిది వందల డెబ్భైరెండు ఆగస్టు పదో తారీకున బెంగుళూరులో ప్రఖ్యాత కన్నడ నాటక రచయితా, ప్రయోక్తా, నాటక చరిత్రకారుడూ అయిన శ్రీ ఆద్యరంగాచార్య (శ్రీరంగ) గారిని కలుసుకొన్నాను. తెలుగు కన్నడ నాటక రంగాలను గురించి జరిగిన చర్చలో ప్రస్తావనవశాన కన్యాశుల్కం సంగతి వచ్చింది.

"అది చాలా గొప్పనాటకం" అన్నారు ఆయన. నే నడిగాను "మీరు చదివారా?"

ఆయన: నేను చదవడమేకాదు, రంగానికెక్కించాను కూడా! కన్నడంలోకూడా అది బాగా రక్తికట్టింది! నేను పది పదిహేనుసార్లు ప్రదర్శించాను. చక్కటి హాస్యం!"

• • •

మన రాజకీయ, సాంఘిక, సాంస్కృతిక నాయకులు ప్రతి జండా వందన సభలోనూ, ప్రాథమిక పాఠశాల వార్షికోత్సవాలలోనూ, సోడా దుకాణాల ప్రారంభోత్సవాలలోనూ తరచూ ప్రస్తావించే ఆంధ్రదేశ వైభవ చిహ్నాల జాబితా (అమరావతీ శిల్పాలు, కాకతీయులు, హంపీ శిధిలములు, కృష్ణదేవరాయలు వగైరా వగైరా) లో గురజాడ పేరు అప్పుడే చేరిపోయింది. అయితే ఆ జాబితాలోని మిగిలిన "ఎంట్రీ"ల లాగా గురజాడ నిశ్శబ్దంగా ఉండిపోలేదు. ఉండుండి చిన్న చిన్న తుఫానులు కలిగిస్తూనే ఉన్నారు.

1955 లో కన్యాశుల్కం రచన ఎవరిది అన్న వివాదం, గురజాడ అకవి అన్న వివాదం 1959 లోనూ, కన్యాశుల్కాన్ని నిషేధించండి, అది అవినీతిని ప్రోత్సహించే నాటకం అన్న వాదం 1962 లోనూ, పత్రికల్లోకి ఎక్కి కొంతలో కొంత మేలు చేశాయి. అప్పారావుని

గురించి మరికొన్ని విషయాలు తెలియచేయడమే కాక ఆ పేరుకున్న వ్యాపారాకర్షణను ద్విగుణీకృతంకూడా చేశాయి.

తాజా తుఫాను పురాణంవారి ఆరోపణ : అవసరాల వారిది అనువాదం కాదు ఫోర్జరీ అని. (ఆంధ్రజ్యోతి) ఇలాంటి గొడవల వల్ల బయలుపడే విషయాలు అట్టే ఉండకపోయినా కొంతమంది సారస్వత ప్రియులలో కొంచెం కొత్తఆలోచనలు కలిగించడానికి ఉపకరిస్తాయి.

పురాణం సుబ్రహ్మణ్య శర్మగారు 1911 నాటి అప్పారావు డైరీలు ఫోర్జరీ అని అనుమానిస్తున్నారు. (ఆంధ్రజ్యోతి అనుబంధం ఫిబ్రవరి, 28, 1976)

అప్పారావుగారి రచనలను మొదటి సారిగా ప్రజాశక్తి ప్రచురణాలయం వారు 1947 ప్రాంతాల శ్రీ పెట్టి ఈశ్వరరావుగారి సహాయంతో కాపీరైటు సంపాయించి అచ్చువేశారు, "ముత్యాలసరాలు కొన్ని కథలు" అనే పేరుతో అప్పటికి ఆ విషయంలో అవసరాలవారి జోక్యంలేదు. ఆ ఎడిషన్‌కు రాసిన పీఠికలో శ్రీ॥ శే॥ వాసిరెడ్డి భాస్కరరావు "నాది ప్రజల ఉద్యమం దానిని యెవరిని సంతోషపెట్టడానికైనా వదులుకోలేను" అన్న వాక్యాన్ని ఉదహరించారు. అందువల్ల ఆ వాక్యాన్ని ఫోర్జరీ అనడానికేమాత్రం ఆధారంలేదు. అసలంతకుముందే బుర్రా శేషగిరిరావు గారు తమ ఉపన్యాసంలో ఉదహరించిన విషయం పురాణంవారికి తెలుసు ! అవసరాల అనువాదానికి ముందే ఇద్దరు పెద్దమనుషులు ఇచ్చిన సాక్ష్యానికి అంగీకరించకపోవడం యెలాగ ?

బహుశా అవసరాల కూడా 1911 నాటి డైరీ వ్రాత ప్రతిని చూసి ఉండకపోవచ్చునేమో? అసలు అప్పారావు గారి డైరీలు 1936 లోనే మహారాజాస్ కాలేజీ (విజయనగరం) డైమండ్ జూబిలీ సందర్భాన అచ్చయినాయి. తుది తీర్పునిచ్చేముందు వాటిని కూడా చూడటం న్యాయం కాదా? అదీకాక డైరీలో (27 మార్చి 1911) రాసుకున్న వాక్యాన్నే కొద్ది మార్పుతో ఏప్రిల్ మూడోతారీకు 1911 న శ్రీ మునిసుబ్రహ్మణ్యంగారికి రాసిన ఉత్తరంలో రాశారు. ఈ రెంటికీ మధ్య వారం రోజుల తేడామాత్రమే ఉంది. అసలు వాసిరెడ్డి భాస్కరరావు గారు ప్రజాశక్తి ప్రచురణాలయంవారి ప్రచురణకి పీఠిక రాసేనాటికి (1947) మునిసుబ్రహ్మణ్యంగారి ఉత్తరాలు వెలుగు చూడలేదు. కన్యాశుల్కంమీద వివాదం జరిగిన రోజుల్లో (1955) అప్పారావుగారు మునిసుబ్రహ్మణ్యం గారికి రాసిన ఉత్తరాల ఉనికి మొదటిసారిగా తెలియవచ్చింది. మునిసుబ్రహ్మణ్యం గారు ఈ లేఖలను గురించి ఆంధ్రపత్రిక (12 ఏప్రిల్ 1955) లో తమ వ్యాసంలో ప్రస్తావించారు. అవసరాల అనువాదం (డైరీలు) ప్రథమ ముద్రణ నవంబరు 1954లో జరిగింది. అందువల్ల మునిసుబ్రహ్మణ్యం గారికి అప్పారావు రాసిన లేఖనుంచి ఎత్తి దాన్ని 1911 డైరీలో చేర్చినట్టు శ్రీ పురాణంవారు ఊహించడం కేవలం అసంగతమేకాదు, దౌర్జన్యంకూడా !

◆ ◆ ◆

అప్పారావుగారి గ్రంథాలన్నీ ఇప్పటికి ఎన్ని ప్రచురణలైనాయి ! కన్యాశుల్కం అప్పారావుగారు పోయినప్పట్నుంచీ కనీసం రెండు సంవత్సరాలకొక ఎడిషన్ చొప్పున వచ్చి ఉండాలి. వావిళ్ళ ముద్రణ తరవాత బహుశా గున్నేశ్వరరావుగారి ముద్రణ వచ్చి ఉండాలి. కనీసం ఇప్పటికి ముప్పై ముద్రణలైనా పొంది ఉండాలి. డైరీలూ, లేఖలూ, ఇతర గ్రంథాలూ ఇంతగా కాకపోయినా బాగానే ప్రాముఖ్యం పొందాయి.

వీటన్నిటిమీదా నికర ధనలాభం ఎంత ఉండి ఉండాలి ?

అప్పారావు కుటుంబానికి గానీ అవసరాల కుటుంబానికి గానీ దక్కిన భాగం ఎంత ?

వందల వేల రూపాయలమీద జరిగిన వ్యాపారంలో అప్పారావు పేరుకున్న వ్యాపారాకర్షణ ఎవరికైనా సులభంగానే విదితమౌతుంది.

అయితే కేవలం వ్యాపారాకర్షణను కలిగి ఉండటమే కాక అంతకుమించి, మహోన్నత మానవతాదర్శాలను ప్రతి తరంలోనూ మార్గదర్శకంగా ప్రతిష్ఠించడంలో ఉంది అప్పారావు గొప్పతనం. ఆ గొప్పతనమే విజమైంది. వ్యాపారాకర్షణ ఇతరులు ఆయనకు అంటగట్టింది.



# గురజాడపై కొన్ని నోట్సు

—భాగవతుల శంకరశాస్త్రి (ఆరుద్ర)

సాంఘిక చైతన్యం కల ఏ రచయితైనా జానపద సాహిత్య ప్రభావం ఎంతగా సంఘ జీవితంపైన ఉందో విస్మరించలేడు. ఆధునిక సాహిత్యానికి ఆద్యుడు, యుగకర్త అయిన గురజాడ అప్పారావుగారు జానపద సాహిత్యాన్ని ఎలాగ పరిశీలించి ప్రయోగించారో గమనించాలి.

మొదటి కూర్పు కన్యాశుల్కంలో ఈ దృష్టి మృగ్యం. అయితే రెండో కూర్పు ప్రచురించే లోపున ఆయన దృక్పథం మారింది. 1895 జూలై 29 వ తేదీనాడు అప్పారావుగారు తమ డైరీలో కొన్ని జావళీలు, పదాలు నోటు చేసుకుంటూ వాటితోపాటు "తా నెవ్వరో తన వారెవ్వరో" అన్న పల్లవి రాసుకొన్నారు. తరువాత-

"చిత్తస్వాతి వాన జోడించి కురియగా
చిప్పలోను బడె చినుకొక్కటి; ఆ
చుక్క ముత్యమై మునిగిపోయేముందు
చిప్పతో చెప్పింది మాటొక్కటి"

అనే చరణం ఏ పాటలోదోగాని నోటు చేసుకున్నారు.

రెండవ కూర్పు కన్యాశుల్కంలో ఇది వాడుకొన్నారు. తొలి అంకాలలో గిరీశం జావళీలూ, కడపటి అంకాల్లో జానపద గీతాలు కనబడతాయి. సారా కొట్లు దృశ్యంలో హవల్దారు అచ్చన హిందీలో తత్వం పాడుతాడు.

పింజర్మె రహాకర్ ఖుష్ నై రహ్నా
క్యారే బుల్బుల్ కహాఁ ఘుల్కె సునా
॥క్యారే॥
యెక్కడికి వెళతావు? యేమి చెప్పవు
బోలో పింజర్మె।

తత్వం హిందీలో ఉన్నా మధ్యలో తెలుగు సంభాషణ గమనించదగ్గ విషయం. ఈ పాటికి అంతరాయం వస్తుంది. ఆగిపోతుంది. తరవాత దుకాణదారు తంబురా తీసుకొని ఇంకో పాట పాడుతాడు.

నాగా దిగురా నా తండ్రి దిగురా
దిగు దిగు నాగన్నా దివ్యసుందర నాగ
ముదముతో రేపల్లె ముద్దుల నాగ
ఊరికి ఉత్తరాన ఊడల మర్రికింద
కోమపుట్టలోని కోడెనాగన్న

ఈ పాటకి కూడా నాటకం కాబట్టి ఇంతలోనే అంతరాయం వస్తుంది. దుకాణదారు పాడినపాట ఆంధ్రదేశంలో చాలా ప్రచారంలో ఉన్నదే. ఇది కోలాటపు

పాటగా చిత్తూరుజిల్లాలో కనబడుతుంది. అయితే అనుపల్లవిలో "ఊరికి ఉత్తరాన !" మొదలైనవి లేవు. డా॥ బి. రామరాజు సేకరించి "త్రివేణి"లో ప్రచురించిన ఈ పాటను చూడండి.

దిగుదిగు నాగా దిగుదిగు నాగా
దిగరా సుందర నాగ
ముదముతో రేపల్లి ముద్దుల నాగ
యిల్లలికి ముగ్గుబెట్టి మల్లెల మొగజల్లి
కొల్లలాడిపోర కోడెనాగయ్యా నాగదిగరా
అది కొండ యిది కొండ నల్లనాగుల కొండ
కొండ నాటున వుండె కోడెనాగన్నా
నాగదిగరా
యెర్రంగ పొద్దుబుట్టి యేడుగడియలాయె
బాలాకు విషమెక్కి బహుభారమయ్యిందీ
నాగదిగరా
సుక్కురారమునాడు సూరిగ్రాణము నాడు
సుక్రుడూ సెందురుడు కోలాటమేయంగ
నాగా దిగరా
ఏకు దొన్నెలలోన గంగతీర్థము తెచ్చి
దండొక్క పొద్దుతో నీ పుట్ట పూజింతు
నాగదిగరా
అందరికి పెద్దోడు దండొక్క పొద్దట
నూటొక్క పూజతో నీ పుట్ట పూజింతు
నాగదిగరా.

ఈ పాటని డాక్టరు రామరాజుగారు చిత్తూరు జిల్లాలోని వావిలితోట గ్రామానికి చెందిన గోవిందు రెడ్డి వారిలో సంపాదించారు. పాటలో శుక్రుడు, చంద్రుడు కోలాటమేస్తారు గనక ఇది కోలాటం పాటే. ఈ పాటని పొరాదుకొణం దృశ్యంలో దుకాణ దారు కూర్చొని పాడడం గమనించదగ్గ మార్పు. అప్పారావుగారు ఈ పాటని యే ప్రాంతంలో విన్నారో బహుశా విశాఖ జిల్లాలో పాఠం వేరుకావచ్చు.

ఈ పాట తర్వాత రామప్పంతులు యింటిముందు తలుపవతల మధురవాణి, తలుపివతల మీనాక్షి పంతుల్ని గౌరవ వేశ్యాక కరటకశాస్త్రుల్ల శిష్యుడు ఒక తత్వం పాడుతాడు. ముందు చరణం ఎత్తుకొంటాడు.

యిల్లు యిల్లనియేవు యిల్లు నాదనియేవు
నీ యిల్లు ఎక్కడే చిలుకా !

'ఈ యిల్లు నాది కాదా అని ఈ పాటలోని మాటలు విని రామప్పంతులు అనుకొంటాడు. శిష్యుడు పాటని కొనసాగిస్తాడు.

ఊరికి ఉత్తరాన సమాధి పురములో
కట్టె యిల్లున్నదే చిలకా !

"వాళ్ల కాట్లోనా ?" అని రామప్పంతులికి అనుమానం కలుగుతుంది. అప్పుడు శిష్యుడు పల్లవీ అనుపల్లవులు పాడుతాడు.

యెన్నాళ్ళు బ్రతికినా యేమి సామ్రాజ్యమే
మున్నాళ్ళ ముచ్చటకు మురిసేవు త్రాళ్ళేవు
ముందుగతి కానవే చిలకా !

రామప్పంతులు ఇక్కడ "ఏమిటీ అపశకునం పాట" అని విచారిస్తాడు. శిష్యుడు ఇంకో చరణం ఎత్తు కుంటాడు.

కర్రలే చుట్టాలు కట్టెలే బంధువులు
కన్న తల్లెవ్వరే చిలుకా !

ఈ ప్రశ్న పాటలో వినబడగానే రామప్పంతులు తర్కించుకొంటాడు. "చుట్టాలా ? వొక్క అప్ప వుంది. అది యెప్పుడూ నా గుమ్మంలో అడుగుబెట్ట లేదు. యిప్పుడు యింటికి యజమాని యెవరూ ? తలుపవతల సానిలంజా, తలుపివతల సంసారి వెధవ లంజా ! యిద్దరూ కలిసి యిల్లు చేరకుండా నన్ను తగులుతున్నారు." అని పంతులు ఆత్మ విమర్శ చేసు కుంటాడు. శిష్యుడు పాటని కొనసాగిస్తాడు.

నిన్ను మోసేరు నలుగురు
వెంబడిని పదిమంది

అనగానే "వెఱ్రిముండా పాట; పోదాం" అని పంతులు గబగబ కొంతదూరం నడిచి నిలుచుని "ఈ తోవనే వస్తున్నాడు కాబోలు పాట వినబడుతోంది" అని వింటాడు. శిష్యుడు పాడుతూనే ఉన్నాడు.

"నువ్వుఁ కాలిపోయేదాక
కావలుఁనుగు గాని
కడకు తోలగొత్తురు
వెంట నెవరూ రారు చిలుకా!"

అని పూర్తి చేస్తాడు. రావప్పంతులు మళ్ళీ 'వెఱ్రి ముండాపాట' అని తాత్కాలిక ఆత్మశోధన మరిచి పోతాడు. అప్పారావుగారు ఈ తత్వాన్ని ఇక్కడ చాలా సామర్థ్యంగా వాడుకొన్నారు. అయితే ఈ పాటకి పాఠాంతరాలు ఉన్నాయి, 'కృష్ణశ్రీ'గారు సంపాదించిన పల్లెపదాలలోని పాఠం చూడండి.

చిలుకాను పెంచేను యెద ముద్దులాడేను
కనుసైగ లేదయ్యె చిలుకా!
మూణ్ణాళ్ళ ముచ్చటకు మురిసేవు చిరసేవు
ముందుగతి కానవే చిలుకా!
కుక్కిమంచము మీద కూలబడిపోతేను
దిక్కెవ్వరే నీకు చిలుకా!
ఇల్లు ఇల్లనియేవు యిల్లు నాదనియేవు
నీ యిల్లు యెక్కడే చిలుకా!
వూరికీ వుత్తరాన సమాధిపురములో
కట్టె యిల్లున్నదే చిలుకా!
కఱ్ఱలే చుట్టాలు కట్టెలే బంధువులు
కన్నతల్లెవ్వరే చిలుకా!
నువు కాలిపోయేదాక కావలుఁదురుగాని
వెంట నెవరూ రారు చిలుకా!

ఈ పాఠంలో "ఎన్నాళ్ళు బ్రతికినా యేమి సామ్రాజ్యమే కొన్నాళ్ళకో రామచిలుకా" అనే పల్లవి లేదు. ఈ పాఠంలోని "కుక్కిమంచం" చరణంగాని, "చిలుకాను పెంచాను" అన్న మొదటి యెత్తుగడగాని, నాటకానికి అనవసరం గనుక అప్పారావుగారు వాడుకో లేదు.

ఈ దృశ్యం పంచమాంకంలోనిది. అయితే షష్ఠాంకంలోని 1వ స్థలం చెరువుగట్టు దృశ్యం దీని కొనసాగింపే. రామప్పంతులు అగ్నిహోత్రావధాన్లని కలుసుకొన్నాక శిష్యుడు 'తానెవ్వరో తనవారెవ్వరో? మాయజీవికి తనువుకు తగులాయెగాక!' అని మరో తత్వం పాడుకుంటూ వస్తాడు. రామప్పంతులు నిలబడి భయము కనబర్చుమ! అన్నాక అగ్నిహోత్రావధాన్లు "యేమిఁ అలాచూస్తున్నారు?" అని ప్రశ్నిస్తాడు. "శవాన్ని మోసుకుపోయే పాట" అని రామప్పంతులు జవాబు చెప్తాడు. వెంటనే శిష్యుడు "దినమూ మరణ మనీ తెలియుడీ" అని యింకోపాట యెత్తుకుంటాడు. రావప్పంతులు వాడిని వారిస్తాడు. ఆ కుఱ్రాడికి రూపాయి లంచం యిచ్చి నోరు మూయిస్తాడు. శిష్యుడు దానిని తీసుకొని "దాసుణ్ణిబాబూ!" అని చెప్పి "చిత్త స్వాతి వాన జోడించి కురియగా" అనేసరికి అగ్నిహో త్రావధాన్లు "యేమిటీ వెధవపాట" అని అడ్డం వస్తాడు. అప్పారావుగారు డైరీలో రాసుకున్నదంతా ఇక్కడ నాటకం కాబట్టి వాడుకోలేదు.

శిష్యుడు అగ్నిహోత్రావధాన్లను వెంటబెట్టుకుని లుబ్ధావధాన్ల యింటికి దారి చూపిస్తూ మళ్ళీ పాడుతాడు. దృశ్యంలో పాట, సంభాషణ ఇలా సాగుతుంది.

శిష్య: "నీలాలకా యేల నీ యలుక?"
అగ్ని: యలకేమిటి? నీ శ్రాద్ధం?
శిష్య: యలకాఁడు పిల్లి (పాడును)
పిల్లన్న తెయితెక్క లాడంగనూ
యలక లేరూగట్టి దున్నంగనూ

అగ్ని : ఏమిటి !

శిష్య : మేకపిల్లల్రెండు మేళాం గట్టుకొని
మేరంగి తీర్థాని కెళ్ళంగమా

అగ్ని : యేమిటి నీ శ్రాద్ధం పాట.

శిష్య : కొండాయనేస్తుడు దొవిగర్ర బట్టుకుని
తోటమల్లి పువ్వు తీరంగమా

అగ్ని : పాడావంటే తంతాను.

శిష్య : అయితే నీకు మరి యిల్లు చూపించను.

అగ్ని : పాడగట్టా. (కొట్టబోవును)

శిష్య : (తప్పించుకోపోతూ)

"గట్టుకిందానున్న పంచాయనేస్తుడు
మరి గుబుకు మరి గుబుకు !"

(నిష్క్రమించును)

అగ్ని : నీది శ్రాద్ధం చెట్టుకింద బెట్టా ! తోవ
యిటా అటాని

(తెర దించవలెను)

ఈ దృశ్యంలోని "నీలాలకా యేల నీ యలక వే! అన్న మాటలు తప్పించి మిగతావన్నీ ఒక పాటలో" ? కాబోలు. అప్పారావుగారు వాడిన చరణాలు ఏ పాటలోనివోగాని ఇవే భావాలుగల పాటలు ప్రచారంలో వున్నాయి. డాక్టరు రామరాజుగారు సేకరించి త్రివేణిలో ప్రచురించిన ఇంకో కోలాటం పాటకు ప్రవేశికలో "ఇందేదో అంతరార్థమున్నదట. చూడగా ఉన్నట్లే తోచును" అన్నారు.

గోవిందా నండమ్మయా నన్ను
గోవిందానండీ

గోవిందా నండక్కయ్యా నన్ను
గోవిందానండీ

చెరువులో రెండు చేపా పిల్లలు
సెలుక్కుమాని సెలుకంగా
గడ్డన వుండె గుడ్డి కొంగా
ముద్దు బెడతాను రమ్మనగా ||గోవిం||

కుంటలో రెండు కోకా కప్పలు
కుణిసీ కుణిసీ కులుకంగా
పుట్టలో వుండె నాగుంబాము
పొప్పలు బెడతాను రమ్మనగా ||గోవిం||

మేకా పిల్లలు మేళంబట్టుక
యాడికి సంతకు బోవంగా
కోడెల్నాకుడు దోవ కడ్డామొచ్చి
పెండ్లికి రమ్మని పిలవంగా ||గోవిం||

గుమ్మం కింద రెండు పందీ కొక్కులు
కడుపు నొస్తానవంగా
మంచంకిందా భావిరిగాడూ
మంతరిస్తాను రమ్మనగా ||గోవిం||

ఈ పాటలోకి మేకపిల్లలు మేళం బట్టుక 'యాడకి' సంతకు వెళ్తాయి. ఇది అనంతపురం జిల్లా తాడిపత్రి తాలూకాలోని గ్రామం. అప్పారావుగారి పాటలోని మేకపిల్లలు మేరంగి తీర్థానికి వెళ్తాయి. అది విశాఖ జిల్లాలోని గ్రామం. రాయలసీమ పాటలోని భావాలు. జంతుజాలాల సంకేతాలు విశాఖ జిల్లాలో వేరే తాళంలో ఉన్న పాటగా మారాయి కాబోలు, పరిశోధించాలి.

• • •

అప్పారావుగారు జానపద సాహిత్యంతో బాటు శతక వాంగ్మయాన్నికూడా కన్యాశుల్కంలో వాడుకున్నారు. పోలిసెట్టి నరసింహ శతకంలోని 'నరసింహా నీ దివ్య నామ మంత్రముచేత' పాదాన్ని 'నరశింద్వ నీ దివ్వో' అని చాలా సార్లు వాడాడు. ఈ నరసింహ

శతకం చాలా ప్రచారంలో ఉన్నది. వేములవాడ నరసింహస్వామి మీద చెప్పింది, విశాఖపట్నంలోని సింహాచలం స్వామివారిపైనా చదివేవారు కాబోలు.

అప్పారావుగారు వేమన్నగారి ప్రసక్తి, వారి పద్యాల ఉదాహరణలుకూడా కన్యాశుల్కంలో ప్రవేశ పెట్టారు. సారాకొట్టు సీమలో దుకాణదారు 'నాగా దిగురా' పాట పాడడానికి ముందుగానే ఈ వేమన పద్యం ఉదహరిస్తాడు.

గాజు కుప్పెలోన గడగుచు దీపంబు
యెట్టులుండు జ్ఞాన మట్టులుండు
తెలిసినట్టివారి దేహంబులందున
యిశ్వదాభిరామ యినరవేమా ॥

ఇది ప్రచారంలో ఉన్నదే. వేమనగారి పద్యమే. తరువాత దుకాణదారు 'పరవశ మైందాకా తాక్కుంచే తాగడవేటి? వేమన చెప్పలేదా?' అని ప్రశ్నించి ఈ పద్యం ఉదహరిస్తాడు.

తాగి, తాగి, తాగి ధరణిపై బడుదాక
తాగనేని తన్ను తాను తెలియు
తాగలేనివాడె తాగుబోతరయగ
యిశ్వదాభిరామ యినరవేమ ॥

ఈ పద్యం వేమనగారిది కాదు. బ్రౌను సంకలనాల లోగాని, వేదునూరు గంగాధరంగారు ప్రచురించిన 5010 పద్యాల సంకలనంలోగాని ఈ పద్యం కనబడదు. వేమన్నగారి పేరుమీద అప్పారావుగారే ఈ పద్యాన్ని కల్పించారనుకోవాలి. ఇలాగే బైరాగి చెప్పే 'తాగుబోతు తోడ తగదెందు నేస్తంబు' అన్న వేమన పద్యపాదం కూడా అప్పారావుగారి రచనే. కన్యాశుల్కంలోని ఇతర శతక పద్యాలను కొన్నింటిని బంగోరె గుర్తించారు. అవి మొదటి కన్యాశుల్కం వ్యాఖ్యానంలో కనబడతాయి.

అప్పారావుగారు వాడిన సామెతలూ, పొడుపు కథలూ మొదలైనవి గమనిస్తే 'జానపద సంస్కృతి'ని ఆయన ప్రతిఫలించడానికే బాగా ప్రయత్నించారని చెప్ప వచ్చు. ఏ మహాకవైనా చేసేది అదే!

"కళను కప్పియుంచుటలోనే కళాచతురత కలదంటారు. ఏదో ఒక నీతిగాని, ఒక రాజకీయ సందేశంగాని, ఒక సంఘ సంస్కార విషయంగాని వ్యక్తపరిచే నాటకం రచించినప్పుడు అది కళా ధర్మమునకు లోబడి గుప్తముగా ఉండవలెనేకాని, ధర్మోపదేశం చేసే ఉపన్యాసం లాగున ఉండరాదు. కన్యాశుల్క విషయం, బాల్య వివాహ ప్రసక్తి కళాధర్మమునకు లోబడునట్లుగానే రచన సాగించారు. గనుకనే అప్పారావుగారి నాటకానికి ప్రఖ్యాతి కలిగినది. సంఘ పరిస్థితి మార్పు చెందినా దాని ప్రఖ్యాతి క్షీణించదు."

—గిడుగు వెంకట సీతాపతి.

(తెలుగు నాటకరంగం కళావని ప్రచురణ నుంచి)

# శ్రీ గురజాడ అప్పారావుగారు

—విశ్వనాథ సత్యనారాయణ



ఇంగ్లీషు చదువు మన దేశంలో మంచి ఫిరాయింపులో ఉన్న రోజుల్లో ఈయన విజయనగరం కాలేజీలో పండితుడు కాబోలు. ఇంగ్లీషులో, తక్కిన సబ్జక్టులలో ఆ రోజులలో పరీక్షాపత్రాలు ఇవ్వటం ఒక నేర్పుగా ఉండేదట. ఆ పరీక్షా పత్రాలు తెలుగులోకూడా ఇవ్వవలసివచ్చినవి. ఆ నేర్పు వీరికి చాలా ఉండేదట. ఆ విద్య వీరిని బట్టే అందరూ నేర్చుకున్నారని ప్రతీతి.

పాశ్చాత్య నాగరికత మహోత్తమమైనదనీ, అది సంపూర్ణంగా అలవడ్డప్పుడే ఈ దేశం కూడా బాగు పడుతుందనీ మన శాస్త్రిలలోని పండితులూ, మన భాషావేత్తలూ పనికిరానివాళ్లుగా చేయబడి ఇంగ్లీషు చదువు చదివినవాళ్ళే విద్యావంతులుగా పరిగణింపబడే రోజులు మంచి హెచ్చుస్థాయిలో ఉన్నవి. ఆదేశాలలో ఏ చిన్న ఉద్యమం, అక్కడ ఎందుకూ పనికిరానివాళ్ళ చేత ప్రారంభింపబడడం, ఇక్కడికి దిగుమతి కావటం, అక్కడ ఎందుకూ పనికిరాని వాళ్ళు ఇక్కడ కలెక్టర్లుగా – గవర్నర్లుగా–లార్డు క్లైవు మొదలైనవాళ్ళు–ఇంగ్లీషు రాజ్య విస్తారకులుగా వచ్చినట్లు ఆ చిన్న చిన్న ఉద్యమాలన్నీ ఇక్కడకు వచ్చి ఇక్కడ మహానుభావులను సృష్టించి వీళ్ళందరినీ నాయకులుగా చేసింది. అట్లాగే సారస్వతంలో షెల్లీ, కీట్సు, బైరన్ ఇలాంటివాళ్ళు మహాకవులు. ఇంగ్లీషు పాఠ్యక్రమంలో మైనర్ పొయెట్రీ అని ఉంటుంది. అక్కడి దేశవాళీ కవులందరూ చిన్న చిన్న పద్యాలు రాసేవాళ్లు. ఆ కవిత్వాలు సంపుటి వేయటం, మైనర్ పొయెట్రీ అని మనకు పంపించటం, ఇక్కడి మన ఇంగ్లీషు పండితులందరూ అదే కవిత్వమనుకోవడం, మన తిక్కన్న పెద్దన్న అలా వ్రాయలేదనటం, దీని వల్ల మన కవుల గౌరవానికి ఇంకా కొత్తదెబ్బ తగలటం.

ఆ దేశంలో ఉన్న మహాకవులకు కూడా రసమంటే ఏమిటో తెలియదు. కావ్యస్వరూపం తెలియదు. విస్పష్టంగా అలంకార జ్ఞానంలేదు. మనకుమల్లే మంచి

## Regret

'e regret the angry old man, Viswanatha the colossus, did not live to see this beauti-l article of his in print. Shri Viswanatha had spent four years (1932-36) of his ecious time acting in the play, KANYASULKAM as Ramappantulu as a filler in ıtween his teaching assignments at Guntur and Vijayawada. This interesting fact, ıne unrecorded in these pages as well as elsewhere, was recently brought to light Shri Yerroju Madhavacharyulu, who, incidentally, co-starred with him in the role of eenakshi.

Ed.

వ్యాకరణ శాస్త్రంలేదు. పిదుక్కి బియ్యానికీ ఒకటే మంత్రమని ఎక్కడపడితే అక్కడ ప్రజాస్వామికం. అందుచేత మనభాష ఏమైంది? వాడుకునే భాష గ్రాంథికభాష కావలసివచ్చింది.

కానీ రాజకీయంగా ప్రజాస్వామికం వేరు. సాహిత్యంలో ప్రజాస్వామికం వేరు. ఆ ఊళ్ళో వాడు పెద్దరైతు. వాని మీద చాలామంది ఆధారపడి ఉంటారు. ఆ కాలూకాలో వాడికి ప్రశస్తి ఉన్నది. ఓట్లన్నీ వాడికి పడతవి. ఈ ఓట్లు వేసే వాళ్ళలో వేయిలో తొమ్మిది వందల మందికి రాజ్యాంగం ఏమిటో, వోటు ఏమిటో తెలియదు. మా కులంవాడికి వేశాం, మా దొర గారికి వేశాం, మా పార్టీకి వేశాం అనే దృష్టే తప్ప ఏమీ తెలియదు. పార్టీలవాళ్ళకే ఆ పార్టీ ఎందుకు పెట్టారో తెలియదు. పరదేశాలలో అట్లాంటి పార్టీ ఉన్నది కనుక మేం పెట్టాం.

సాహిత్యంలో కూడా ఇలా అయితే ఎలాగా? వాడుక భాషలో పుస్తకాలు వ్రాయాలి. మన వాడుక భాషలో సగానికి సగం ఇంగ్లీషు మాటలైనవి. హాస్యంగా మాట్లాడటం చమత్కారంగా మాట్లాడటం కొందరికి సహజంగా ఉంటుంది. శ్రీ గురజాడ అప్పారావు పంతులుగారికీ అలా మాటాడటం సహజమల్లే ఉంది.

సాహిత్యంలో ఈ ఇంగ్లీషు విద్య కొత్త విమర్శ సూత్రాలని తెచ్చింది. ఒకటి లోకల్ కలర్. రెండవది బహుపాత్ర చిత్రణం. మూడవది ప్రజలకు అందు బాటులో ఉండటం. ప్రజలంటే ఎవరు అన్న ప్రశ్న లేదు. ఈ సిద్ధాంతాలు అప్పారావు పంతులుగారికి చాల లాభించినవి.

ఇట్లా ఉండగా మన దేశంలో బాల్య వివాహాలు ఉండేవి? ఎక్కడ ఉండేవి? బ్రాహ్మణుల్లో ఉండేవి. తక్కిన కులాలలో ఉండేవి కావు. బ్రాహ్మణుల్లో ఎందుకు ఉండేవో అది కర్మవిషయం. వీళ్ళకు తెలి యదు. ఆ విధవలకి పెళ్ళిళ్ళు చేస్తే సంఘ సంస్కార మైంది. మన సంఘాన్ని దూషించడం చక్కగా కుదురుతోంది. కామమూ ధనమూ రెండే ప్రధానంగా బ్రతికేవాళ్ళకి అన్నీ రైటే.

కాదు. కావ్యదృష్ట్యా చూద్దాము. అది కావ్యం కాదు. దాని కాద్యంతములు లేవు. రచనా శిల్పంలేదు. ఆయనకు ఉన్న శక్తి హాస్యరసం. రెండవది బ్రాహ్మణ సంఘంలో ఉన్న ఎందుకూ పనికిరాని వాళ్ళని గురించి వెక్కిరించటం.

కవి అందాం. పద్యం రాయనివాడు కవి కాదు. పాటలు వ్రాసేవాళ్ళు కవులు కారు. వీళ్ళ అదృష్టం కొద్దీ ఇప్పుడు అచ్చు పుస్తకాలు ఎలా ఉన్నయ్యో అయిదారు వందల ఏండ్ల నుండి మన దేశంలో అలా అచ్చు ఉంటే వీళ్ళ కాతల సారస్వతం ఎంత అధో గతిలో ఉండేదో తెలిసేది.

ఆయన కొన్ని పాటలు వ్రాశాడు. అది కవిత్వ మెట్లా అవుతుంది. కవిత్వానికి ఛందస్సు ప్రధానం. పాటలకు రాగమూ లయా ప్రధానం.

ఛందస్సు ప్రధానం కనుకనే కవిత్వాన్ని విద్య అన్నారు. దానిని గురించి చెప్పటానికి లక్షపేపు పడు తుంది. ఆ ఛందస్సులో వ్రాసినాడు శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులు. వ్రాసినా కవి కాలేదు. ఎందు చేతనంటే కవిత్వం విద్య అని ఆయనకి తెలియలేదు కనుక. వాళ్ళిద్దరినీ ఇప్పుడు మనవాళ్ళు ఎంత పైకెత్తాలో ఎత్తుతున్నారు. మన పద్య రచన ఏమిటో, అందులోని శిల్పమేమిటో, కావ్యమంటే ఎట్లా ఉండాలో, రసము లంటే ఏమిటో, వాటిని సాధించటమెట్లాగో, అలంకా రాలూ, రసములూ, ధ్వనులూ, శైలులూ ఈ మొద లైన వాటియొక్క ఏ పరిజ్ఞానం లేకుండా నేడు విమర్శ కులైపోతున్నారు. కవులైపోతున్నారు.

కాని ఈ కాలానికి అప్పారావుపంతులుగారు వ్రాసిన కన్యాశుల్కం పనికివస్తున్నది. నిజానికి పనికిరావడం లేదు కూడాను. ఎందుచేతనంటే ఆ పుస్తకంలో విమ ర్శింపబడ్డ సాంఘిక పరిస్థితులు ఇవాళ క్రొత్తగా లేవు. బాగా పాతబడిపోయినవి.

అసలు మన దేశంలో ఇంగ్లీషు చదివినవాళ్ళ జన సంఖ్య ఎంత? ఆ అల్పశాతానికే కదా ఈ కన్యాశుల్కంలోని విట్టులు తెలిసేది. ఇంకా మన అదృష్ట వశాత్తు ఇంగ్లీషు పోలేదు. కాని పోతే ఆ పుస్తకం స్థితి ఏమిటో తెలియదు.

రేడియోలలో పత్రికలలో ఈ సన్మాన సంచికలూ, ఈ సాంవత్సరీకములూ వీటితో అల్పులధికులై పోతున్నారు. అయితే మనకేమీ నష్టంలేదు కాని దేశంలో ఉన్న అల్పులను అధికులు కాకుండా చేస్తున్నారు. వాళ్ళకు యదార్ధ జ్ఞానం లేకుండా చేస్తున్నారు.

ఇలాంటి కొన్ని గుంపులు ఉన్నవి. ఆ గుంపులను దాటితే వాళ్ళ సంగతి ఎవరికీ అక్కరకు లేదు. ఈ ప్రచారమంతా ఆ గుంపులో చేసుకుంటూ వుంటారు. మళ్ళీ ఏ గుంపు కా గుంపే. కనుక గుంపు కవులు బయలుదేరుతున్నారు తప్ప ప్రజాకవులు బయలుదేరటంలేదు.

తరువాత ఎవరికివారు ఆలోచించుకోవలసిందే. శ్రీ గురజాడ అప్పారావు పంతులుగారు వివేకి, చమత్కారి. ఇది నిజం. వీరేశలింగం పంతులుగారు అనేక గ్రంథములు వ్రాశారు. అదీ నిజమే. అప్రస్తుతమైన ఒకమాట చెపుతున్నాను. డాక్టరు సి. ఆర్. రెడ్డి మన సాహిత్యం బాగా తెలిసిన వాళ్ళల్లో ఒకడు. ఆయన వీరేశలింగం పంతులు కవికాదు అన్నాడు. కన్యాశుల్కం నాటకం కాదని నాటకమంటే తెలిసినవాడు ఎవడైనా అంటాడు. ఆ గుంపుల్లో ఉండి సారస్వతమంటే పాశ్చాత్యక సారస్వతమే అనుకొని ఆ లక్షణమైనా బాగా తెలిసినవాళ్లు కొంతమంది ఉన్నారు. పేర్లు చెప్పటమెందుకు? వాళ్ళనడిగినా కన్యాశుల్కం నాటకం కాదంటారు. చిత్రగించవలెను.

పైగా ఈ దేశంలో ప్రతివాణ్ణీ మహాకవి అనటం అలవాటైంది. వాళ్లు మహాకవులు కారు. మహాత్కవులు అనేవాళ్ళు గొప్పవాళ్ళు కనుక.

"నువ్వు పంపిన పుస్తకము అందినది. కళ్ళకద్దుకున్నాను. ముద్దు పెట్టుకున్నాను. మీ నాన్నను చూసినట్టయింది. నేనూ, వాడూ కలుసుకొని ఎన్నాళ్ళయిందో."

—గురజాడ కావ్యసంపుటి పంపిన రామదాసుతో గిడుగు.

"గురజాడ రచనలన్నీ నష్టమైపోయి ఒక్క 'దేశభక్తి' గీతం మిగిలినా చాలును. అతడు ప్రపంచ కవులలో ఒక్కడుగా లెక్కించదగిన మహాకవి అని ఋజువు కావడానికి."

—శ్రీ శ్రీ

# కన్యాశుల్కంలో మధురవాణి పాత్ర

—కొడవటిగంటి కుటుంబరావు



గురజాడవారి "కన్యాశుల్కం"లోని పాత్రలలాగా సజీవంగా ఉండే పాత్రలు ప్రపంచ నాటక సాహిత్యం లోనే అరుదని తోస్తుంది. వాటిలో మధురవాణి పాత్ర అక్షరాలా అపూర్వమైనది. ఈ పాత్రను గురించి లోగడ కొందరు రాసినట్టు గుర్తు. కొందరు మధురవాణిని వసంతసేనతో పోల్చినట్టు కూడా జ్ఞాపకం. వసంతసేన మధురవాణికన్న ఉదాత్తమైన పాత్ర అనటానికి సందేహంలేదు, కాని అది మధురవాణిలాంటి "చీమూ, నెత్తురూ" గల పాత్రమటుకు కాదు. అపార ప్రజ్ఞా వంతుడు సానబట్టిన వజ్రం మధురవాణి పాత్ర. దాన్ని ఎటునుంచి చూసినా ఏదో రంగుచిమ్మి, కళ్ళు జిగేలు మంటాయి.

"కన్యాశుల్కం" రచనలో మధురవాణి పాత్రను గురజాడ ఎలా పొదిగినదీ ఇప్పుడు నేను చర్చించ బోవటంలేదు. ఆ నాటకం చదివేవాడికీ, చూసేవాడికీ మధురవాణి పాత్రకు సంబంధించిన వివిధ లక్షణాలూ, పటుత్వమూ ఎలా వ్యక్తమవుతాయో పైపైన తడివి ప్రస్తావించుతాను.

నాటకం ప్రారంభమైన కొద్ది క్షణాలకే మనం మధురవాణి పేరు వింటాం. గిరీశం తన స్వగతంలో "మధురవాణిని వదలడమంటే ఏమీ మనస్కరించ కుండా వున్నది....యీ రాత్రికి మధురవాణికి పార్టింగ్ విజిట్ యివ్వందే పోగూడదు!" అంటాడు.

తరవాత వచ్చే దృశ్యంలో మనం మధురవాణిని ఆమె ఇంట్లోనే చూస్తాం. ఆమెను ఉంచుకోవటానికి వచ్చిన రామప్పంతులు నుంచి డబ్బు రాబట్టటానికి మధురవాణి తన వృత్తికి సహజమైన నయవంచన ఉపయోగిస్తుంది. కాని ఆమె అనేదానిలో వంకపెట్ట టానికి వీలుండదు: నీతి నిజాయితీలను ఆమోదించేవాళ్ళ ఆమె మాటలు నమ్మితీరాలి. అవి చవకపాటు అబ ద్ధాలు కావు.

నిజానికి మధురవాణి ఈ నాటకంలో ఎదురొక్కనే పాత్రలలో రామప్పంతులును మించిన మేధా వులూ, గడుసువాళ్ళూ ఉన్నారు. కనుకనే ఆమె రామప్పంతులుతోనూ, గిరీశంతోనూ పిల్లి ఎలుకలతో ఆడుకున్నట్లు ఈ సందర్భంలో ఆడుకోగలుగుతుంది. మంచంకింద దాక్కున్న రామప్పంతులుకూడా, "చబాష్! ఏమి నీతయిన మనిషి యిది!" అని మధురవాణికి కితాబు యిస్తాడు. మరి కాస్సేపటికి గిరీశం ఆమెను గురించి, "యిదేవిటో మంచిమనిషి అని భ్రమిం చాను" అంటాడు. వచ్చేవాడి కళ్లు మూసుకు పోవటమూ, వెళ్ళేవాడి కళ్లు తెరుచుకోవటమూ సబబే కదా!

అయితే, ఆఖరుక్షణందాకా తాను మంచి మనిషి అని గిరీశాన్ని నమ్మించగల మధురవాణి ప్రజ్ఞను మనం మెచ్చుకోవాలి.

గిరీశం మధురవాణిని ఎలా ఉంచుకోగలిగాడు? పూటకూళ్ళమ్మ డబ్బు 20 రూపాయలు "డాన్సింగ్ గరల్స్" కింద ఖర్చుపెట్టేశామని గిరీశం తన స్వగతంలో అంటాడు. ఆ డబ్బంతా తెచ్చి మధురవాణికే ఇచ్చినట్టు పూటకూళ్ళమ్మ ఆరోపణ చేస్తుంది. కాని గిరీశం మధురవాణిని ఆర్థికంగా పోషించలేదని ముందు ముందు స్పష్టమవుతుంది.

మధురవాణి మనుషులను గాడిదలను చెయ్యటంలో ఎంత నేర్పుగలదో, అవసరమైతే సముదాయించటంలోనూ అంత చాకచక్యం గలది. గిరీశం తనను కొట్టిపోతే రామప్పంతులు, "కనిస్టీబుకు కబురంపించు," అంటాడు. "యెందుకు పట్టీకున అల్లరీ అవమానమున్నూ! రేపో, యెల్లుండో వాడికి దెబ్బకి దెబ్బతీసి పగ తీర్చుకుందురుగాని!" అంటుంది మధురవాణి. అందులో ఉన్న "కాంప్లిమెంటు" కూడా అర్థంచేసుకోలేని కుంఠ అయిన రామప్పంతులు, "మనకెందుకు శరీరాయాసం? యీ వెధవని పజ్యందు కోర్టులంటా తిప్పకపోతే నేను రామప్పంతుల్ని కాను చూడు నా తమాషా?" అని తన అసమర్థతనూ, కోర్టుపక్షి ఘనతనూ ఒకేసారి చాటుకుంటాడు. అప్పటికీ మధురవాణి, "దొంగదెబ్బ కొట్టినవాడిదే అవమానం, మీదికాదు!" అని అశక్తుణ్ణి బుజ్జగించినట్టు బుజ్జగిస్తుంది. ఈ నాజూకుకు కూడా అర్హుడుగాని రామప్పంతులు, "నొప్పె వడి దను కున్నావు?" అని మధురవాణిని అడుగుతాడు.

అయితే, "యీ రామప్పంతుల కథ పైకి పటారం లోపల లొటారంలా కనిపిస్తుంది. యీమారు వేగం సవరించి చెయ్ చిక్కినంతా సొమ్ము చిక్కించుకొని పెందరాళే మరో కొమ్మ పట్టుకోవాలి" అని మధురవాణి నిర్ణయించుకొనటానికి ఎంతోకాలం పట్టదు. అయితే ఆమె రామచంద్రపురం అగ్రహారం నుంచి విశాఖపట్నం చేరేలోపుగా ఎంతో గ్రంథం నడవటమే గాక, అందులో మధురవాణి ప్రముఖమూ, కీలకమూ అయిన పాత్ర నిర్వహించటము కూడా జరిగింది.

## స్వా వ లం బ న

మధురవాణి తనతో సంబంధంగల వాళ్ళందరి గుట్టు మట్లూ తెలుసుకోగల మనిషిలాగా కనిపిస్తుంది. గిరీశం విషయంలో పూటకూళ్ళమ్మ సంగతీ, రామప్పంతులు విషయంలో మీనాక్షి సంగతీ ఆమెకు తెలుసు. ఆమె తన యోగక్షేమాలు తాను చూసుకుంటుందిగాని, వాటికోసం ఇతరులపైన ఆధారపడదు. అయినా ఆమె ఇతరుల యోగక్షేమాలు చూడగలదు. ఈ సంగతి మనకు త్వరలోనే తెలుస్తుంది.

ఆమె స్వావలంబనలో ఒక అంశమేమంటే ఆమె దాదాపు చివరిదాకా తన వృత్తిని పల్లెత్తుమాట అనదు, తన వృత్తి ధర్మాన్ని విస్మరించదు. "విద్యవంటి వస్తువు లేదు, నిజమే—ఒకటితప్ప. అదేఁవిటి? విత్తం. డబ్బురానివిద్య దరిద్రహేతువు" అని ఆమె తన వీణమీద సాధన కట్టిపెట్టుతుంది." హెడ్డు కానిస్టీబు సౌజ్ఞచేసి వెళ్ళాడు. అతడు యిచ్చేదీ చచ్చేదీ లేదుగాని, జట్టీలేపైనావస్తే ఓ పొద్దు కాస్తాడు" అంటుంది.

మధురవాణి స్వావలంబన ఎంత సమర్థమైనదో, ఆమె ఆత్మవిశ్వాసం అంత అచంచలమైనది. ఎలాంటి పరిస్థితిలోనూ ఆమె తడబడటమూ, బేజారెత్తటమూ, నిస్సహాయురాలు కావటమూ మనం చూడం.

## మరో మధురవాణి

సుబ్బిని లుబ్ధావధాన్లు పెళ్ళాడే ప్రయత్నాన్ని భగ్నం చెయ్యటానికి కరటకశాస్త్రి తన శిష్యుడికి ఆడపిల్ల వేషం వేసి రామప్పంతులు సహాయంకోసం వచ్చి, అక్కడ మధురవాణిని చూసి ఆశ్చర్యపడిపోతాడు. కరటక శాస్త్రి మధురవాణి విటులలో ఒకడు. కాని అతనితో మధురవాణి రామప్పంతులుతోనూ, గిరీశంతోనూ వ్యవహరించినట్టు వ్యవహరించదు — మరో మధురవాణి అయిపోతుంది. ఆమె మాటలలో చిత్తశుద్ధీ, ఆప్యాయతా, మర్యాదా, స్నేహభావమూ కనిపిస్తాయి." యివ్వాళ్ళకైనా యీ దీపురాలు మీకు

జ్ఞాపకం రావడం అదెంత కాదు?" అంటుందామె. తనను గిరీశం ఉంచుకోవటం ఎలా జరిగిందో, ఆమె కరటకశాస్త్రికిచెప్పి, "మొన్నటిదాకా గిరీశంగారు నన్ను వుంచారుగాని, డబ్బుకి యటాముటీగా వుండేది" అని బయట పెట్టుతుంది. ఆమె రామప్పంతులుతోవచ్చెయ్యటానికి డబ్బే కారణం.

అదేం చిత్రమో, మధురవాణి ఇతరులపట్ల ఏ విధమైన సాధుభావం ప్రదర్శించినా అవతలి వాళ్లు ఆ మర్యాద దక్కించుకోలేరు. గడుసుపిండం కరటకశాస్త్రి కూడా పప్పులో కాలేస్తాడు: "గిరీశం నిన్నుంచుకున్నాడా? మా మేనల్లుడికి చదువు చెప్పటానిక్కుదురుకుని మావాళ్ళింట్లో చేరాడు. వాడికి పెందరాళే ఉద్వాసన చెప్పాలి" అంటాడు.

వెంటనే మధురవాణి, "నా దగ్గిరికి వచ్చినవాడల్లా చెడిపోయినాడో?....మీ భార్యాగారు ముందు మిమ్మల్ని మెడపట్టుకుని యింట్లోంచి తరవ్వాలిసింది" అని మెత్తని చెప్పుతో కొడుతుంది. ఇందులో గిరీశాన్ని సమర్థించటం ప్రధానం కాదు, ఆత్మాభిమానమే ప్రధానం.

కరటకశాస్త్రి వెంటనే తగ్గి హాస్యంగా ఆ చెప్పు దెబ్బ స్వీకరిస్తాడు. వెంటనే మధురవాణి ఆ విషయం వదిలేస్తుంది.

"నీలాంటి మనిషి మళ్ళీ వుందా?" అన్న కరటకశాస్త్రితో మనం పూర్తిగా ఏకీభవించవచ్చు.

## స్నేహితులకు సహాయం

కరటకశాస్త్రి ఆడదలచిన నాటకం గురించి తెలుసుకోగానే మధురవాణి ఆ నాటకంలో తాను నేపథ్య పాత్ర ధరించి, ఆ నాటకం విజయవంతం చెయ్యటానికి పూనుకుంటుంది. తన "చెయ్యి" ఏమాత్రమూ బయటపడకుండా మధురవాణి ఈ పని ఎంత నేర్పుగా సాధించేదీ మనం చూస్తాం. ఆమె కరటకశాస్త్రికి అవసరమైన సలహాలు ఇస్తుంది; కరటకశాస్త్రి, "నిన్ను సంతోషపెట్టడం నావిధి" అనేసరికి, "ఆ మాట మీరు శలవివ్వడం నాకు విచారంగా వుంది. వృత్తిచేత వేశ్యని గనక చెయ్యవలసినచోట్ల ద్రవ్యాకర్షణ చేస్తానుగాని, మధురవాణికి దయాదాక్షిణ్యాలు సున్న అని తలచారా? మీ తోడబుట్టుకి ప్రమాదం వచ్చినప్పుడు నేను డబ్బుని ఆశిస్తానా?" అంటుంది.

మధురవాణిని పూర్తిగా అర్థంచేసుకున్న పాత్ర నాటకంలో ఎక్కడా కనబడదు. అందరితోబాటే కరటకశాస్త్రీనూ. అయినా ఆమె కరటకశాస్త్రి స్థాలిత్యాలను సహించినట్టు రామప్పంతులుని సహించలేదు. రామప్పంతులిచ్చిన డబ్బు తన తల్లికి పంపేశానన్నప్పుడు మధురవాణి అబద్ధమే ఆడివుండవచ్చు, కాని రామప్పంతులు "వొట్టబద్ధాలు" అనేసరికి మధుర వాణి దురభిమానం ప్రదర్శించి తాళాలగుత్తి అతగాడి మొహాన కొట్టి, "చూసుకోండి," అంటుంది. చూడాలని రామప్పంతులు అనుకోలేదని మధురవాణికి బాగా తెలుసునా? ఈ ఆత్మాభిమాన ప్రదర్శనతోబాటు మధుర వాణి కరటకశాస్త్రికి ఒక అవకాశంకూడా కల్పించింది. అతను తన పని చెప్పకముందే రామప్పంతులుకు పాతికరూపాయలిచ్చేసి, "క్లయంటు" అయిపోగలుగుతాడు.

ఈ నాటకంలో అనేకచోట్ల మధురవాణి ప్రవర్తన బహుళార్థ సాధకంగా ఉండటం మనం చూస్తాం. అందుచేతనే మన దృష్టిలో మధురవాణి కళలు హెచ్చుతున్న కొద్దీ, నాటకమంతటిలోకి మృణ్మయపాత్ర అనదగిన బుచ్చమ్మ వ్యామోహంలో పడిన గిరీశం దృష్టిలో మధురవాణి "రంగువేసిన గాజుపూస"గానూ, బుచ్చమ్మ "ప్యూర్ డైమండ్"గానూ కనిపిస్తారు.

## ప్రధాన పాత్ర

"కన్యాశుల్కం"లో నాయికా, నాయక పాత్రలంటూ లేవు. అందులో మధురవాణి పాత్ర ఒకటే ప్రధాన పాత్ర. నాటకానికి పడిబొడ్డయిన చతుర్థాంకంతో

మధురవాణి మానసిక శక్తులూ, ప్రజ్ఞాపాటవాలూ పరాకాష్ఠ అందుకోవటం మనం చూస్తాం. ఇందులో ఆమె, లౌకికజ్ఞానంలో తనను మించినవాడు లేడనుకునే రామప్పంతుల్నీ, తనకన్న రెండున్నరరెట్లు వయసుగల లుబ్ధావధాన్లునూ కీలుబొమ్మలుచేసి ఆడించటమేగాక, మూడో బ్రాహ్మడైన కరటకశాస్త్రిని ఒక ఒడ్డుకు చేరుస్తుంది. క్షణం పాటైనా మిగతా పాత్రలు మధురవాణి పట్టునుంచి తప్పించుకున్నాయనే భావం మనకు కలగదు. ప్రసిద్ధమైన మధురవాణి నవ్వు—దాన్ని పట్టుకుందామనే శిష్యుడు చూస్తాడు ; — కరటకశాస్త్రికి ఎంతగా ఉపయోగపడిందో ఊహించటం కష్టం.

ఈ ఘట్టంలో మధురవాణి ప్రయత్నాలు ఎంత విజయవంతమైనా శ్రమపడకుండా మాత్రం సాగలేదు. ముందు గిరీశం గురించి ప్రస్తావించి రామప్పంతుల్ని హడలగొట్టుతుంది. (అగ్నిహోత్రావధాన్లు కూతుర్ని లుబ్ధావధాన్లు చేసుకుంటే గిరీశం పెళ్ళికి వస్తాడు ;) ధైర్యమూ, అధైర్యమూ సమపాళ్ళుగా పోస్తుంది, పిల్లీ ఎలుకా ఆట ఆడుతుంది. అంచెలంచెలమీద లుబ్ధావధాన్లును అగ్నిహోత్రావధాన్లు సంబంధానికి విముఖుణ్ణి చేస్తుంది. అంతా అయినాక లుబ్ధావధాన్లు వద్దనుకున్న సంబంధం గురించి గునుస్తున్నట్టు కనబడగానే, "నిమిషంకింద పెళ్ళి వద్దన్నారే ; యిప్పుడు పెళ్ళి తప్పిపోయిందని కోపవా?" అని, గొర్రెను మళ్ళించి పట్టు మళ్ళిస్తుంది. అప్పటికీ ఆ "గొర్రె" సులువుగా మళ్ళదు. "ఏమి యీ మగవారి చిత్రం ; యింత సేపూ పెళ్ళి వద్దని వాగిస్తిరి? యిప్పుడు పెళ్ళి తప్పిపోయిందని వాగిస్తిరి. నిజంగా మీకు పెళ్ళాడాలని ఉందండీ ?" అని మధురవాణి లుబ్ధావధాన్లును నిలవదీసి అడుగుతుంది.

ఇప్పటికింకా కరటకశాస్త్రి నాటకానికి పూర్వరంగమే-రెండో సంబంధం కుదిరేటట్టు చేసేముందు ఉన్న సంబంధం తప్పించటం. ఈ పూర్వరంగంలో ప్రతి చిన్న ఎత్తూ మధురవాణిదే ; కాని ఆ సంగతి రామప్పంతులుకుగాని, లుబ్ధావధాన్లుకుగాని చచ్చినా అంతుచిక్కదు. అదీ మధురవాణి ప్రజ్ఞ ; వాళ్ళు తమ స్వార్థంకోసమే నిర్ణయం జరుగుతున్నదనుకుంటారు.

ఉత్తర రంగం మొదలుకాకముందు మధురవాణి లుబ్ధావధాన్లుతో విచిత్రమైనమాట అంటుంది. "నేను మీ యింటికి వెళ్ళిపోయొస్తాను. రండి. పెళ్ళీ గిళ్ళీ మానెయ్యండి. మీకు పెళ్ళాంకన్నా యెక్కువగా సంరక్షణ చేస్తాను" అని, లుబ్ధావధాన్లుకు ఇంకో సంబంధం చూసే ఆలోచన రాకుండా చెయ్యటానికి ప్రయత్నిస్తుంది. ఆమె ఎత్తులు బహుళ ప్రయోజనాత్మకంగా ఉంటాయనటానికి ఇది మరో మంచి నిదర్శనం. ఈ దెబ్బతో రామప్పంతులు లుబ్ధావధాన్లచేత రెండో సంబంధానికి ఒప్పించటానికి మరింత గట్టిగా ప్రయత్నిస్తాడు—అతనికి నిజంగా మధురవాణి వెళ్ళిపోతుందని భయమే. అంతేగాక, సానిదాన్ని తెచ్చి ఇంట్లో ఉంచుకునేది అనూహ్యమైన లుబ్ధావధాన్లుకు పెళ్ళాం "సంరక్షణ"మీద మోజు తగ్గకుండా ఉండిపోతుంది.

అయితే, తెలిసో తెలియకో మధురవాణి ఈ మాట అని రామప్పంతులుపని మరింత క్లిష్టం చేసింది. కష్టైనా, కంపనా కాలని లుబ్ధావధాన్లు, "పెళ్ళి ప్రయత్నం మానుకోవడమే ఉత్తమం అని తోస్తుంది యేమిటి కలవు ?" అంటాడు. "నా కలవేం యేసింది ? మధురవాణి కలవైంది. దాని బుద్ధికి ఆనందించి అలా నడుచుకుంటున్నారు." అని రామప్పంతులు లుబ్ధావధాన్లుకు చెప్పుతాడు. ఆ తరవాత రామప్పంతులు తన లక్ష్యమే మధురవాణి లక్ష్యమని ఊహించడం సాధ్యమా ?

కరటకశాస్త్రి పని తీరిపోయింది. అతని శిష్యుణ్ణి ఆడవేషంలో లుబ్ధావధాన్లు పెళ్ళాడాడు. అర్ధరాత్రివేళ శిష్యుడు వేషం విప్పేసి, మధురవాణి కంటెతో సహా పారిపోయి మధురవాణి ఇంటికి వచ్చి, తన "వెంట్రిలోక్విజం"లో మధురవాణి ఇంట చిన్న తుఫాను రేపాడు. వాడు రామప్పంతులు గొంతుతో

మాట్లాడితే మధురవాణి మోసపోతుంది. అపజయం ఎరగని మధురవాణి. "ఔరా ఇంద్రజాలి! పంతులు గొంతుక యెలా పట్టావు? నన్నే మోసపుచ్చితివే!" అని తన గొప్పతనం చాటుకుంటూనే శిష్యుణ్ణి మెచ్చుకుంటుంది.

## తుఫానుమధ్య కొండ

కరటకశాస్త్రి ఆడిన నాటకానికి ఉత్తరకాండ ఒక పెద్ద తుఫాను, లుబ్ధావధాన్లు పెళ్ళాడిన పిల్ల బావిలో పడి ఆత్మహత్య చేసుకుందని పుకారు పుట్టింది. శవం కనిపిస్తే రాబందులు పీక్కు-తినటానికి వస్తాయి. శవం దొరక్క-పోయినా పోలీసురాబందులు పీక్కు-తింటాయి. చచ్చిపోయినదాని దయ్యాన్ని సీసాలో బంధించారు కదా? ఈ సందర్భంలో తన కంటె తెచ్చియ్యమని మధురవాణి రామప్పంతుల్ని లోపలికి రానియ్యలేదు. అవే రామప్పంతులుకు విడాకులు. తరవాత మధురవాణి అగ్రహారంనుంచి బిచాణా ఎత్తేసి, విశాఖపట్నం చేరింది.

లుబ్ధావధాన్లూ, కరటకశాస్త్రీ కూడా మెడలోతు ఊబిలో కూరుకుపోయారు. మధురవాణి కరటకశాస్త్రితో "యెప్పుడైనా మీ యిద్దరి ప్రాణాలకీ నేను కనికరించి అడ్డుపడాలిగాని, మరి యెవడికీ సాధ్యంకాదనుకుంటాను," అన్నమాట అక్షరాలా నిజం. కాని తాను వాళ్ళ ప్రాణాలకు ఎలా అడ్డు పడగలదో చెప్పదు. మధురవాణి కంటె ఇస్తే, దాన్నీ, తాను తీసుకున్న పన్నెండువందలు రొక్కా-న్నీ లుబ్ధావధాన్లుకు పంపిస్తే చిక్కు- విడిపోతుందంటాడు కరటకశాస్త్రి. ఆమె కంటె ఆమెకు తిరిగి రావటానికి సౌజన్యారావు పంతులు ఒప్పుకుంటాడా అంటాడు.

మధురవాణి తనను సౌజన్యారావుపంతులు దగ్గిరికి తీసుకెళ్ళమంటే కరటకశాస్త్రి అభ్యంతరం చెబుతాడు— ఆయన చాలా మంచివాడూ, నీతిపరుడూనూ! (కరటకశాస్త్రి సౌజన్యారావుపంతుల్ని మధురవాణి నుంచి కాపాడుతున్నాడు.)

"నిజమేదో సౌజన్యరావుపంతులుగారితో చెప్పి మీరుకూడా కొంచెం లోకోపకారం చెయ్యరాదా?" అని మధురవాణి అడిగితే కరటకశాస్త్రి తనకుమాలిన ధర్మం ఉంటుందా అని స్వార్థం బయట పెడతాడు. మధురవాణి తన కంటె తనకు తిరిగిరావటం గురించి అనుమానం వెలిబుచ్చినప్పుడు అతను. "యెంతపేపూ డబ్బు డబ్బేనా? స్నేహం, వలపూ అనేవి వుంటాయా?" అంటాడు.

"స్నేహం మీలాటివారి చోట. అందుచేతనే కష్టపడి ఆర్జించిన కంటె మీపాలు చేస్తున్నాను .... యికనేల పో? బతుకనేది వుంటే వలపువన్నె తెలుస్తుంది.... సానిదానికి వలపు మనస్సులోనే మణగాలి. కొద్దికాలం వుండే యవ్వనాన్ని జీవనాధారంగా చేసుకున్న మా కులానికి వలపు ఒక్క-చోటే .... బంగారంమీద" అంటుంది.

అప్పటిదాకా తన వృత్తిమీద ఎలాంటి ఆక్షేపణా చెయ్యని మధురవాణి ఈ సందర్భంలో ఒక చిత్రమైన కోరిక వెలిబుచ్చుతుంది. "కాపు మనిషినై పుట్టి, మొగుడి పొలంలో వంగ మొక్క-లకూ, మిరప మొక్క-లకూ దోహదంచేస్తే, యావజ్జీవం కాపాడే తన వాళ్ళన్న వారు వుందురేమో?"

మగవాడి ప్రపంచంలో ఆడది తనకాళ్ళమీద తాను నిలబడటం శ్రమతో కూడుకున్న పని. అందులోనూ మధురవాణి ఒకరికి సహాయం చేసిన మనిషి, ఒకరి మీద ఆధారపడిన మనిషికాదు. ఆమెకు తన జీవిత విధానం భారమనిపించటంలో ఆశ్చర్యంలేదు.

మధురవాణి నావ సౌజన్యారావు పంతులులాంటి దేవుని ఆశ్రయించటానికి సిద్ధంగా ఉన్నది. అది గ్రహించలేని కరటకశాస్త్రి తన స్వార్థంకోసం డిప్టీ కలెక్టరును ఆశ్రయించమని మధురవాణికి సలహా ఇస్తాడు! ("ఆయన ఒక్క-డే మిమ్మల్ని కాపాడ గలిగినవాడు") ఇచ్చి చివాట్లు తింటాడు! చింత

చచ్చినా పులుపు చావదన్నమాట "కన్యాశుల్కం"లో చాలా పాత్రలకు వర్తిస్తుంది. కరటకశాస్త్రి మధురవాణి నుంచి "గురోపదేశం" పొందికూడా ఆమెతో మర్నాడు "ఎంగేజిమెంటు" పెట్టుకోజూస్తాడు. మధురవాణి శిష్యుడిచేత చిలకపాట పాడించి కరటకశాస్త్రి "తల వాయ గొట్టుతుంది."

చిట్టచివరకు మధురవాణి ఎవరి సహాయమూ లేకుండానే మగ వేషంతో సౌజన్యారావుపంతులు పడక గదిలో ప్రత్యక్షమయింది. చివరకు ఆయనకూడా మధురవాణి చేతిలో చిత్తుకాక తప్పలేదు. ఆయనలో వేశ్యాద్వేషం హేతుబద్ధంకాదని ఆమె నిరూపిస్తుంది. ("వేశ్యా సంపర్కం కలవాడు యెన్నడూ మంచివాడు కానేరడు")

"వేశ్యలను పాటకు పిలవకపోతే వాళ్లు బతకడం యెలాగండి ?.... పెళ్ళి చేసుకోగోరిన వేశ్యలకు కోర తగిన పీుటలు దొరకడం యెలాగండి ? యెట్టివారినైనా వరే అని తమ అభిప్రాయమా అండీ ?" అని మధుర వాణి సూటిగా అడిగితే, సౌజన్యారావు, "ఈ సంగతి యింకా నేను బాగా ఆలోచించలేదు," అనవలసిన దుస్థితిలో పడతాడు.

మధురవాణి సౌజన్యారావును అంతటితో వదలదు, లోగడ కరటకశాస్త్రికి పరీక్షపెట్టినట్టే సౌజన్యారావుకు కూడా పరీక్ష పెడుతుంది. బుద్ధావధాన్లును కాపాడటానికి ఆయన వేశ్యాద్వేషం మానుకుంటాడా ? సౌజన్యారావు పిల్లికి చిక్కిన ఎలుకలాగా తన్నుకుంటాడు—"నేను మట్టుకు వోడిపోయినానని ఒప్పుకుంటాను" అంటాడు.

సౌజన్యారావుపంతులు దగ్గిరకూడా మధురవాణి తనకు కొన్ని నీతినియమాలున్నట్లు మాట్లాడుతుంది. ఈ ఎత్తు పూర్తిగా నిష్కపటం కాకపోవచ్చు. కాని ఆమె సౌజన్యారావు నీడలోనికి రావటానికీ, నా వృత్తి మానటానికీ నిశ్చయించుకున్నమాట నిజం. ఆ ప్రయత్నంలో ఆమె "కేసు"కు తగిన విషయాలు వెల్లడించటమేగాక, సౌజన్యారావును ఒక్కొక్క అడుగే దగ్గిరికి తెచ్చుకుంటుంది.

ఈ విధంగా మధురవాణి పాత్రను గురజాడవారు సృష్టించారు. ఆ పాత్రలో అంతస్సంఘర్షణ లేకపోలేదు, కాని వాటిని మధురవాణి స్వశక్తితో పరిష్కరించుకుంటుంది. తాను కోరిన పరిస్థితులను తానే సృష్టించుకుంటుంది. సామాన్య వేశ్య అయి ఉండి తన సమీపంలోకి వచ్చిన అందరికన్నా తనది హెచ్చు కుశాగ్రబుద్ధి అని నిరూపిస్తుంది. నిజంగా అపూర్వ సృష్టి !

"కన్యాశుల్కం భీభత్సరస ప్రధానమైన విషాదాంత నాటకం."

—శ్రీ శ్రీ

"దేవుడు చేసిన మనుషుల్లారా !
మనుషులు చేసిన దేవుళ్ళారా !
మీ పేరేమిటి ?"

—గురజాడ

# కామ్రేడ్ గురజాడ



-శ్రీరంగం శ్రీనివాసరావు

ఒకప్పుడిదో వేళాకోళపు మాట. కమ్యూనిస్టులు గురజాడను కామ్రేడుగా మార్చి అందలమెక్కించారట. అంతేగాని గురజాడ కవి కానేకాడట.

ఇప్పటికీ గురజాడను కవిగా గుర్తించని గాడిద లున్నాయి. ఈరెండు కాళ్ళ గాడిదలకి ఇప్పటికీ ఘనసన్మానాలు జరుగుతూనే ఉన్నాయి. స్వచ్ఛమైన సత్యాన్ని చంపి చచ్చుపుచ్చు అబద్ధాలనే కవిత్వంగా చలామణీ చేసే వాళ్ళకి గురజాడలోని మహత్తర మానవత్వం అర్థం కాదు. వీళ్ళకి ఎదుటివాడు ఒక దేవతగానో, రాక్షసిగానో కనబడతాడేతప్ప తనలాంటి మనిషిగా కనిపించడు.

ఎవణ్ణి నీ నెత్తిమీద కత్తిసాముచేసే నిరంకుశ ప్రభువుగా కాని నీ కాలి కింద పడి అఘోరించే దానిస పురుగుగా కాని భావించకపోవడమే కమ్యూనిజం.

ఇవాళ నీ యింటికి రెండువేల రూపాయలతో వచ్చినవాడే నీ పాలిటి దేవత! వాడి ఇష్టార్థ ప్రత్యర్థం నువ్వెన్ని అబద్ధాలు ఆడటానికైనా జంకవు.

నీ యింటిముందు నిలబడ్డ రిక్షావాడొక రాక్షసుడు. వాడి రక్తం వేరు. నీ రక్తం వేరు. అలా నీ మతం చెబుతుంది. నీ సంస్కారం చెబుతుంది. "పవిత్రం అంటే మీదీ నాదీ!.... నేను వెధవ ముండనీ మీరు సరసులా" అని మీనాక్షి రామప్పంతులుతో అంటుంది. ఇలాంటివి కన్యాశుల్కం నిండా కోకొల్లలు. ఇవి ముసుగు కప్పని నిజాలు. ఒరేయ్ అపవిత్రుడా! కళ్లు తెరు.

గురజాడ గురించి ఇవాళ కొత్తగా ఏం రాయగలనను కున్నాను. కాని "కన్యాశుల్కం" నాటకాన్ని తలచు కుంటేనే చాలు ఈ మానవ జీవితంమీద ఎన్నో కొత్త వెలుగులు ప్రసరిస్తాయి.

మానవత్వ సమానత్వానికి "కన్యాశుల్కం" ఒక నిషాని. అందులో మనుష్యులే ఉన్నారు కాని దేవతలూ, దానవులూ లేరు. అందరూ సజీవ పాత్రలే. ఎవరూ కవిగారి సొంత పైత్యంలోంచి పుట్టుకొచ్చిన నిర్జీవ కల్పనలు కాదు.

"కన్యాశుల్కం" గ్రంథాన్ని భీభత్స రసప్రధాన మయిన విషాదాంత నాటకంగా ఇప్పటికీ అభివర్ణించడం మానలేను. ఇందులోని భీభత్సం మన జీవితాలలోనిదే. ఇందులోని విషాదం మన జీవితాలదే అయితే గ్రీకు ట్రాజెడీల్లోలాగా, షేక్స్పియర్ ట్రాజెడీల్లోలాగా తెర ఆఖరిసారి పడిపోయేసరికి స్టేజినిండా శవాలు నిండే ట్రాజెడీ కాదు "కన్యాశుల్కం". స్టేజి ముందుండి నాటకం చూస్తున్న వాళ్ళని ఒక క్షణకాలం శవాలుగా మార్చి మరుక్షణం ప్రాణప్రతిష్ట చేసే అపూర్వ సృష్టి.

"కన్యాశుల్కం" సంగతి సరే. దాన్నిగురించి ఎంతయినా రాసుకుపోవచ్చు. అదో మహా సముద్రం. జీవితమంత విశాలమైనదీ, అగాధమైనదీ.

కథకుడుగా కూడా గురజాడ జీవితాన్ని మసిపూసి మారేడుకాయ చెయ్యలేదు. "మీ పేరేమిటి?" అన్న కథ దేవుడిమీద గురజాడ చేసిన ఛాలెంజి.

రామాయణం చదివి సీతమ్మ కష్టాలకు కన్నీరు కార్చేవారూ, హరిశ్చంద్ర నాటకం చూసి చంద్రమతి కోసం బెంగపెట్టుకునేవారూ పుత్తడిబొమ్మ పూర్ణమ్మ కథను చదవడం మంచిది.

గురజాడని కవిగా గుర్తించలేని "వెధవాయ"ను మనిషిగా నేను గుర్తించలేను. "మనవాళ్లు ఉత్త వెధవాయలోయ్" అని గిరీశంచేత ఊరికే అనిపించలేదు గురజాడ!

కనిపించని వంద కల్పవృక్షాల కన్న ఒక "దేశభక్తి" గీతం మిన్న. సన్మానాలుపొందే లక్ష సామ్రాట్టుల కన్న ఒక కామ్రేడ్ గురజాడ మేలు. ●

"తన శక్తియందు తనకు నమ్మకం లేనివాళ్ళు గట్టిపని ఏదీ చేయలేరు. ఏదో ఒక త్రోవ త్రొక్కిన వాడల్లా లోకోపకారి."

—గురజాడ.

"అడుగుజాడ గురజాడది
అది భావికి బాట
మనలో వెధవాయత్వం
మరిపించే పాట"

—శ్రీ శ్రీ.

"యావద్భారతదేశంలోనూ శూద్రకుని 'మృచ్ఛకటికం' తర్వాత "కన్యాశుల్కం" వంటి నాటకం ఇంకొకటి వెలువడనే లేదు."

—శ్రీ శ్రీ

# గురజాడ గురవే నమః

—దాశరథి కృష్ణమాచార్యులు



కొత్త తరానికి గురువెవరంటే
గురజాడే అని నే నంటాను,
రిత్తను చెత్తను మెచ్చని సత్కవి
గురజాడే అని ఒప్పిస్తాను.

మనుషుల నాల్కల మెసలే భాషే
మన భాషన్నాడు గురజాడ,
భాష సజీవం కావాలంటే
ప్రజలను మరవద్దన్నాడా!

గురజాడే నా విజయ పతాకం
గురజాడే నా నూతన లోకం
అతడు గుచ్చిన ముత్యాలసరం
ఆంధ్రమాత గళసీమకు అందం

అతడు వ్రాసిన దేశభక్తి ప్ర
బోధ కమ్మగు దివ్యగీతం
మరపురాని మనోజ్ఞ మంజుల
మహిత మానవవాద గీతం

అనాంధ్రు డెవడైన – మనలో
ఆధునిక యుగమునకు ఆద్యుడు
యెవ్వరంటే – ఒక్క గొంతున –
అప్పరావని చెప్పు డయ్యా!

# గురజాడ అప్పారావు పంతులు

—శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

అప్పారావు మహాకవి. అతని గ్రంథాలు శతాధికాలు కావు, కాని అన్నీ సానలు తీరిన జాతి రత్నాలు.

అప్పారావు భావుకత్వాన్ని గ్రహణశక్తి కల వారిలో కొంతమందే యెరుగుదురు. చాలా మంది యెరక్కపోవడానికి కారణం మిక్కిలి చిన్నదే; అయితే చాలా బలమయింది.

అప్పారావు కన్యాశుల్కం సరికొత్త సరుకు. వీరేశలింగంపంతులు నవీన వాఙ్మయ నిర్మాతయే, గాని అతని వాఙ్మయం పాఠకలోకానికి కన్యాశుల్కాన్ని చక్కగా పరిచయపరుప జాలేటంతటిది కాలేకపోయింది. పైగా—

అప్పారావు పేరు మొదట కవిగాకంటే వ్యావహారిక భాషావాదిగా ప్రఖ్యాతి పొందింది. పండితులు చేసిన ప్రతివాదాలు, పత్రికలు చేసిన విమర్శనలూ, అక్షరాస్యుల కందరికీ అతన్ని పరిచయ పరిచాయి. తరవాత కన్యాశుల్కమూ, ఖండ కావ్యాలూ, చిన్నకథలూ, మాటామంతీ వ్యాసపరంపరా రసికుల హృదయాల మీద అతని పేరు అచ్చుగుద్దేశాయి.

అప్పారావో రాచకూతురికి ప్రయివేటు సెక్రటరీగా కాక స్వతంత్రుడై వుంటే యింకా యెన్ని మహాగ్రంథాలు రచించి వుండునో. ఆంధ్ర వాఙ్మయానికి, ఆ మూలాన్ని ఆంధ్ర సంఘానికి యింకా యెంత వికాసం కలిగించి వుండునో.

అప్పారావు మృతివల్ల అతని జీవలేఖిని గళితమై పోవడమే కాదు; అనేకమంది నవకవులకు కావలసిన మంచి వరవడి అసంపూర్ణమైపోయింది.

అప్పారావు రచనల్లో పెద్దదీ, ప్రధానమూ అయిన కన్యాశుల్కం నాటకమా, ప్రహసనమా ? ఇది అనవసర ప్రశ్న. ఏమంటే ఆ గ్రంథాన్ని గురించి యోచించతగ్గ ప్రధాన విషయం యిది కాదు. అందులో కవిత్వం వుందా లేదా, వాఙ్మయ పిపాసువు లాస్వాదించడానికందులో రసం వుందా లేదా ?

అప్పారావు రచనలు చేతబట్టి శబ్దయాపాలు మాత్రమే పరిశీలించేవాడు రసికుడు కాడు, పండితుడూ కాడు, చివరికి వాఙ్మయం అంటే అభిరుచికలవాడుకూడా కాడు.

అప్పారావు వాస్తవంగా ఆంధ్ర వాఙ్మయాకాశం మీద ధృవతార. అది అనశ్వరం మాత్రమేకాదు; మార్గదర్శకం కూడాను.

నేడు కుమార కవి సింహాల్లో అప్పారావుని అనుకరించేవారనేకులున్నారు. అప్పారావు రచనల మాధుర్యాన్ననుభవించే రసికులు కూడా చాలామందే వున్నారు. కాని ఆ మహాకవిని గౌరవించడానికి ఒక శిలావిగ్రహ ప్రతిష్ఠాపనం లేదు; వొక తైలచిత్ర ప్రదర్శనమేనా లేదు; చివరికి, నలుగురూ వొకచోట కూర్చుని అతని భావుకత్వాన్ని స్మరించుకోవడమేనా లేదు.

మొన్న మొన్న కళాసమితివారు మాత్రం చిన్న యెత్తుమీద రాజమహేంద్రవరంలో వొక స్మృతిసభ జరిపారు.

మొత్తానికి మనలో అకార్యకరణమేగాని, కర్తవ్య నిష్ఠ తక్కువ; ఉద్రేకమేగాని ఉత్తేజము తక్కువ; అనుకరణమేగాని స్వయం నిర్ణయం తక్కువ.

గురజాడ అప్పారావుపంతులు ఆంధ్ర వాఙ్మయంలో కొత్తపోకడలు చూపిన ధీశాలి. అతన్ని మనం మరిచిపోతే అది చాలా దౌర్భాగ్యంలో చేరిపోతుంది. ●

(మిగడ తఱకలు - భారతి జనవరి 1933.
157 వ పేజి)

# శ్రీ గురజాడ అప్పారాయ కవి

—చింతా దీక్షితులు

విద్యానిలయమైన రాజమహేంద్రవరములో ఉన్న కవులకున్నూ, చిన్న కవులకున్నూ కూడా గౌరవము జరుగుతూనే ఉన్నది. శ్రీ వడ్డాది సుబ్బారాయుడుకిన్నీ, శ్రీ కృష్ణమూర్తిశాస్త్రిగారికిన్నీ మొన్న మొన్ననే గొప్ప గౌరవము జరిగినది. ఆధునిక కవులకు మార్గదర్శియై శ్రీ అప్పారాయకవి స్మారకోత్సవము జరుపుటకు కళా సమితివారు పూనుకొని తమకూ, ఆంధ్రదేశమునకూ గౌరవము సంపాదిస్తున్నారు. అసాధారణ ప్రతిభావంతుడైన అప్పారాయకవిగారిని గౌరవించడము ఆంధ్రదేశమును గౌరవించడమే అవుతుంది.

ఈ కాలములో పూర్వపద్ధతిని కవిత్వము చెప్పే పండితులు పెక్కురున్నారు. నూతన పక్కీని కవిత్వము చెప్పుతూన్న యువకులు పెక్కురున్నారు. ఈ ఉభయవర్గములవారు 'నన్ను ముట్టుకోకు నా మాల కాకి' అనుకోకుండా ఒకరినొకరు అర్థము చేసుకోవలసిన అవసరమున్నది. ఇటువంటి సభలు అట్టి సద్భావము కలగడానికి సహాయకారులుగా వుంటవి.

అప్పారాయ కవిగారిని తలచుకుంటే రెండు విషయములు మనస్సునకు తట్టుతవి. వారు భాషలో తీసికొనివచ్చిన మార్పు ఒకటి. సారస్వతములో వారు ప్రవేశపెట్టిన మార్పు ఒకటి.

మొట్టమొదట అప్పారావుగారు ఇంగ్లీషులో పద్యాలు వ్రాసేవారట. అవి చాలా బాగుండేవనిన్నీ, పలువురు పండితులు వాటిని మెచ్చుకునే వారనిన్నీ చెబుతారు. కాని తన ప్రతిభను తన భాషలోనే వ్యక్తముచెయ్యవలెననేఉత్సాహంతో వారు తెలుగులోనే తమ కావ్యములు వ్రాశారు. సజీవమైన భాషలోనే అందముగా తమ భావములను వెల్లడిచేస్తే ఎక్కువ రసవంతముగా ఉంటుందని ఆయన ఊహించి ఉండవచ్చు. వీరి మిత్రులైన గిడుగు రామమూర్తి పంతులుగారూ, వీరూ కలిసి గ్రాంధికము పరిమిత ప్రయోజనము కలదనీ, వ్యవహారిక భాష అపరిమిత ప్రయోజనము కలదనీ నిర్ణయించారు. ఇందుకొరకై వారు బ్రహ్మాండమైన పరిశోధన చెయ్యవలసి వచ్చినది. ముఖ్యముగా రామమూర్తి పంతులుగారు ఈ విషయమై పరిశోధన కార్యము జరిగించి వ్యావహారిక భాషను వాడడము సంప్రదాయసిద్ధమేనని నిరూపించారు. శాసనములలో పండితులు వ్రాసిన శాస్త్రములలో, టీకలలో, కథలలో, ఇతర కావ్యములలో ప్రాచీనులీ జీవద్భాషనే ఉపయోగించినారు. పరిశోధనలలో తాము తెలుసుకొన్న విషయములు వారు ఉపన్యాసముల ద్వారా, పత్రికల ద్వారా, గ్రంథముల ద్వారా లోకానికి వెల్లడిచేశారు. మొట్టమొదట ఈ భాషలో గ్రంథ రచనకు పూనుకొంట అప్పారావుగారే. నేటి యువకులు కొందరు కూడా జీవద్భాషలో కావ్యములు వ్రాసి సారస్వత సేవ చేస్తున్నారు. శ్రీ అప్పారావుగారు ఈ విషయమై చేసిన పరిశోధనము Telugu Composition Controversy సందర్భమున పుస్తకరూపముగా ప్రకటింపబడియున్న Minute of Dissent లో చూడవచ్చును. సంస్కృత-ఆంధ్ర-ఆంగ్లభాషలలో పండితుడనిపించుకొన్న అప్పారావుగారి సిద్ధాంతము మనచే అంగీకరింపబడవలసినదే ఇక సారస్వతములో వారు ప్రవేశపెట్టిన మార్పును గురించి— అప్పారాయ కవిగారు వ్రాసినది 1. పాటలు, 2 నాటకములు, 3. ఖండ కావ్యములు, 4. చిన్న కథలు 5. వ్యాసములు. వీటి అన్నింటిలోనూ వారు క్రొత్త

మార్గమే తొక్కారు. ముఖ్యముగా వీరి ప్రతిభ నాటకములలోనూ, ఖండకావ్యములలోనూ కానవస్తున్నది. కన్యాశుల్క మందరికీ తెలిసినదే. కొండుభట్టీయమూ, బిల్హణీయమూ అసంపూర్తిగా ఉన్నవి. బిల్హణీయము మిగిలిన రెంటి మార్గములకన్నా భిన్నముగా నున్నది. అప్పారావుగారి సర్వతోముఖ ప్రజ్ఞ అందు గోచరమగుచున్నది. ఈ రెండు నాటకములలో పరిశుద్ధమైన కంద గల జాతీయ భాష వాడారు. ఎన్ని సంవత్సరాల కాలమో పరిశీలనచేసి గ్రహిస్తేనేకాని అటువంటి భాష పట్టుబడదు. ఇందలి పాత్ర పోషణాదులు అనితర సాధ్యములు. ఖండకావ్యములు నూతన పక్కని వ్రాయడములో కూడా ఈయనే ప్రథముడు. నీతి, దేశభక్తి, సంఘ సంస్కరణమూ విశాల దృష్టితో ఈయన తన ఖండకావ్యములలో బోధించినారు. చిన్న పిల్లలకు ఒక పాటకూడా వ్రాసియున్నారు. చిన్న మాటలలో పెద్ద భావము ఇమిడ్చే శక్తి వీరికి ఎక్కువగా కలదు. వీరి 'లవణరాజు కల' యోగవాసిష్ఠమునుండి తీసుకోబడ్డది. దేశ కాలములు మాయా కల్పితములని అందలి విషయము ఒక్కొక్క నిముషములో ఒక జీవిత కాలమును ఇమిడ్చి అది సత్యమనే భ్రాంతి కలిగించడము ఆ కథ ప్రయోజనము. అప్పారావుగారు ఈ కథనే సంఘ సంస్కరణమునకు సాధనముగా గ్రహించి జయప్రదముగా నడిపించారు. నేటి అస్పృశ్యతా నివారణ సమస్యకు వారప్పుడే దీర్ఘ దృష్టితో మార్గము చూపించారు.

"మంచి చెడ్డలు మనుజులందున
యెంచి చూడగ రెండెకులములు
మంచియన్నది మాలయైతే
మాలనే అగుదున్"

అని చాటిచెప్పారు.

దేశభక్తి అంటే ఏమిటో ఈ క్రింది గీతములో వెల్లడిచేశారు:

"దేశమును ప్రేమించుమన్నా
మంచి అన్నది పెంచుమన్నా
వొట్టిమాటలు కట్టిపెట్టోయి
గట్టిమేల్ తలపెట్టవోయి.

పూను స్పర్థను విద్యలందే
వైరములు వాణిజ్యమందే
వ్యర్థకలహం పెంచబోకోయి
కత్తి వైరం కాల్చవోయి

స్వంతలాభం కొంతమానుకు
పొరుగువారికి తోడుపడవోయి
దేశమంటే మట్టికాదోయి
దేశమంటే మనుషులోయి."

ఇంగ్లీషు చదువులనుగూర్చి వీరు ఒక పాత్రచేత పలికించిన మాటలివి.

"చాలునిహ మీ చాకచక్యము
చదువుకిదె కాబోలు ఫలితము
ఇంతయగునని పెద్దతిరిగిన
ఇంగిలీషులు చెప్పుదురా?

కోటపేటల నేలగలరని
కోటి విద్యలు మీకు కరపిరి
పొట్టకూటికి నేర్చు విద్యలు
పుట్టకిట్లు కదల్చెనా?"

ఆడపిల్లల పాటలలో ఎత్తుబడి పద్యములు ఎంత మనోహరముగా నున్నవో—

"మేలిమి బంగరు మెలతల్లారా!
కలువల కన్నుల కన్నెల్లారా!
తల్లుల గన్న పిల్లల్లారా!
విన్నారమ్మా ఈ కథను!

ఆటల పాటల పేటికలారా
కమ్మని మాటల కొమ్మల్లారా
అమ్మలగన్న అమ్మల్లారా
విన్నారా మీరీ కథను !

లవణరాజు కలలో నూతన దంపతులకు వృద్ధుడు చెప్పిన నీతులు చిన్న పద్యములో ఇమిడ్చి ఉన్నారు.

"ఏలుకోను డొండొగుల; సిరులకు
మిట్టి పడకుడు; కీడుమూడిన
కుంగకు డొరుల మేలుకు
పాటుపడు డెపుడున్"

ముత్యాలసరములు అనే పద్యం వీరు మొట్ట మొదట పార్సీగజల్ వరుసను తెలుగులో ప్రవేశ పెట్టారు, నేడా పద్యం ఎంత ప్రజారంజకముగా వాడ బడుచున్నదో అందరికీ తెలిసిన విషయమే. వీరు చిన్న కథలు రెండే వ్రాసినారు. ఆంధ్ర జీవితము కొంత అందులో ప్రతిబింబిస్తున్నది.

వ్యాసము :

ముత్యాలసరములు మొదట వ్రాసినప్పుడు పండితులు వీరి పద్యమునూ, భాషనూ ఆక్షేపించారు. వారికి సమాధానంగా వీరొక వ్యాసం వ్రాశారు. అందు ముత్యాలసరము లక్షణమూ, తమభాష యొక్క ఔచిత్యమూ చర్చింపబడినవి. వీరు పత్రికలకు అప్పుడప్పుడూ 'మాటామంతీ' అని హాస్యరస ప్రధానమైన చిన్న వ్యాసములు వ్రాసేవారు. చాలా అందముగా ఉన్నవవి.

అప్పారావుగారు సారస్వత సేవ పలువిధములుగా చేయ పూనుకున్నారుగాని యెక్కువగా వ్రాయలేదు. కాని వారు పట్టిందంతా బంగారము మాత్రము చేశారని ఒప్పుకొనక తప్పదు.

అప్పారావుగారిని మెచ్చుకోనివారు అభినవాంధ్ర కవులలో నేనెరిగినంతమట్టుకు ఎవరూ లేరు. నేడు కావ్యములు వ్రాపే యువకులందరూ ఆయనను మార్గదర్శిగా అంగీకరించిన వారే. కాని ఏ కారణము చేతనో వారు భాషా విషయముననైతే నేమి, రచన విషయమున నైతేనేమి అప్పారావుగారికి భిన్నముగానే నడుస్తున్నారని అనక తప్పదు.

కన్యాశుల్కమువంటి నాటకములు తెలుగులో లేవు. వచన నాటకములకు అప్పారావుగారే ఆదిభిక్ష పెట్టారు. రెంటాల వెంకట సుబ్బారావుగారు కన్యాశుల్కమువలె వచన నాటకమును వ్రాయ సమకట్టి 'వరశుల్కము' వ్రాశారు. కాని అది అంత ప్రౌఢముగా లేదు. వచన నాటకములలో పానుగంటివారి వృద్ధ వివాహము, కంఠాభరణం మొదలైనవి హాస్యరసమును మాత్రము చూపుచున్నవి. అప్పారావుగారి శిల్పములేదు. గుడిపాటి వెంకటచలంగారు మున్నగువారు వచన నాటకాలు వ్రాస్తున్నారు కాని వారి మార్గమే వేరు. అప్పారావు గారిని ఆదర్శముగా పెట్టుకొని వచన నాటకాలు వ్రాస్తున్నవారు నేడు లేరేమోననిపిస్తున్నది.

కావ్యములు :

కావ్య నిర్మాణ విషయమున కూడా అప్పారావు గారి మార్గ మవలంబిస్తున్నవారు కొద్దిమంది మాత్రమే నడుస్తున్నారు. కాని చాలామంది కవులు వీరి ముత్యాల సరమును బాహాటముగా వాడుతున్నారు. భాషా విషయమున అప్పారావుగారి మార్గమవలంబించడానికి ప్రయత్నిస్తున్నవారు బసవరాజు అప్పారావుగారు. కాని భాషలోకాని, భావములలోకాని వీరు వారిని అందలేదు.

దేశభక్తి విషయమై రాయప్రోలు సుబ్బారావు, విశ్వనాథ సత్యనారాయణ మున్నగువారు ఉద్రేకము పుట్టించే పద్యములు వ్రాశారు కాని వారి భాషవేరు. అప్పారావుగారి పద్యములలో బిగువు వున్నది. వారి దేశభక్తి ఆంధ్రదేశమును దాటి హిందూదేశము కంతకూ చెందివున్నది.

సంఘ సంస్కరణ విషయములందు మంగిపూడి వెంకటశర్మగారు కావ్యములద్వారా ఎక్కువ పరిశ్రమ చేస్తున్నారు. వారి పద్యములకు కాఠిన్యములేదు.

అప్పారావుగారి సంఘ సంస్కరణ సందేశము వారి శిల్పములో ఇమిడి ఉన్నది. గీతావందుదు వ్రాసిన 'కాపుపెండ్లి' అనే కావ్యము అప్పారావుగారి పద్యాలను కొంతవరకూ సమీపిస్తున్నది.

దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు అప్పారావుగారి మీద దివ్యమైన పద్యాలు వ్రాశారు. అప్పారావుగారు 'ఎత్తు అంగరు' పద్యములవంటి పద్యములుకూడా వ్రాశారు. కాని వారి కావ్యజాలమునుబట్టి జూచినట్లయితే వీరు అప్పారావుగారిని మార్గదర్శిగా అంగీకరిస్తారా అని పిస్తుంది.

కృష్ణశాస్త్రిగారూ, వారిని అనుకరించేవారూ, శుద్ధ గ్రాంధికమునే వాడుతున్నారు. కృతక భాషకూడా కొంత వాడుతున్నారు. ఉన్నతమైన వారి భావములు మృదువైన శబ్దజాలములో మరుగుపడిపోతున్నవి. అప్పారావు గారు భాషను ఒక వాహనముగా గ్రహించారే గాని భాషే పరమార్ధమనుకోలేదు. అందువల్లనే వారి భావములు హృదయమును సూటిగా వచ్చి తాకుతవి.

అప్పారావుగారు వ్రాసిన ప్రేమగీతములకున్నూ, నేడు యువకులు వ్రాస్తున్న ప్రేమ గీతములకున్నూ శిల్పమునందే భేదమున్నది.

చిన్నపిల్లలకు ప్రత్యేకముగా పనికివచ్చే గీతములు వ్రాస్తున్నవారు ఈ కాలములో జయంతి గంగన్నగారు, బెల్లంకొండ కనకమ్మగారు, కవికొండల వెంకట్రావు గారు, అడవి బాపిరాజుగారు మున్నగువారు కొందరే వున్నారు ఏమైనా అప్పారావుగారి ఆడపిలల పాటలు వీటి అన్నింటికీ తలమానికమే అని వొప్పుకోకతప్పదు. ఈ కాలములో కవులు పలువురున్నారు. అప్పారావుగారు నైపుణ్యముతో వాడిన జీవద్భాషనూ, వారి శిల్పమునూ వీరు తెలుసుకొని వారివలెనే వీరునూ వ్రాయ ప్రయత్నిస్తే భాషకు చాలా లాభకరముగా వుంటుంది.

చిన్ని కథలు వ్రాస్తున్నవారూ ఈ కాలమున చాలా మంది ఉన్నారు. ఆంధ్రజీవితమును ఉన్నదున్నట్లు చెప్పినవారు అప్పారావుగారు కదా. వారివలెనే ఆంధ్ర జీవితమును చిన్ని కథలద్వారా వెల్లడిచేసేవారు కొద్ది మందే కలరు. శ్రీపాద సుబ్రమణ్యశాస్త్రి మున్నగువారు ఈ కార్యము చేస్తున్నారు. వెంకటాచలంగారి కథలు శక్తివంతముగా ఉంటవి కాని నేటి సంఘమునే ఆయన నిరూపిస్తున్నారా అనే సందేహము కలుగుతుంది. సాహితీసమితిలోని కొందరు చక్కని కథలు వ్రాశారు అప్పారావుగారు ఇంకా కొన్ని చిన్ని కథలు వ్రాసి ఉన్నట్లయితే సరియైన ఆదర్శము నేటి కథకులకు దొరికివుండేది. బెంగాలీ జీవితమునూ, ఆంగ్ల జీవితమునూ, తెలుగు పేర్లు పెట్టుకొన్న పాత్రల సహాయమున కథలలో వెల్లడిచేసేవారు ఆంధ్ర సారస్వతానికి ఉపకారము చేయడములేదు.

ఇక ఈ కాలమున వ్యాసమున ప్రత్యేక కృషి చేస్తున్నవారెవరూ ఉన్నట్లు తోచదు. కొంతవరకు అప్పారావుగారి వ్యాసములను మనసులో పెట్టుకుని, అందముగా, చెప్పదలచుకున్న విషయము కొద్ది మాటలలో చెబుతూ వ్యాసములు వ్రాయడమునకు కొందరు ప్రయత్నించవలెను. వ్యాసము కూడా సారస్వతాంగమే.

అప్పారావుగారు రాజకీయవేత్త, పండితుడు, పరిశోధకుడు, సంఘ సంస్కర్త, కవిగ్రామణి. నేటి పలువురు కవులను వారి కావ్యములే కావ్యరచనకు పురికొల్పినవి. ఇట్టి మహనీయుని స్మరించుకొంటూన్న మనము ధన్యులము.

[ భారతి, డిసెంబరు 1932 : పే 903 - 907 ]

# గురజాడ మనస్తత్వంలోని విపరీతధోరణి

రాచమల్లు రామచంద్రారెడ్డి

గురజాడ "కన్యాశుల్కం" గురించి చాలా కాలంగా నాకొక సందేహం వుంది— ఆ నాటకం ఆయన అలా యెందుకు రాసినాడా అని. గురజాడ ఆడపిల్లలను అమ్మే పద్ధతికి వ్యతిరేకం, బాల్య వివాహాలకు వ్యతిరేకం, వితంతు వివాహాలకు అనుకూలం. కానీ "కన్యాశుల్కం"లో యే సమస్యకూ సరైన పరిష్కారం లభించలేదు. చివరి రంగంలో మధురవాణిని సంస్కరించడంద్వారా నాచ్ సమస్యకు ఒక పరిష్కారం— అసంతృప్తికరమే ఐనా, యేదో ఒకటి—లభించింది; కానీ నాటకంలో ముఖ్యమైన వితంతు వివాహ సమస్య అల్లరిపాలైంది. బుచ్చమ్మనూ, మీనాక్షినీ వితంతు శరణాలయానికి పంపే యేర్పాట్లు జరిగినాయి. కానీ, వాళ్ళ పునర్వివాహానికి మాత్రం యేర్పాట్లు జరగలేదు. నాటకంలో గిరీశంను ప్రధాన ప్రాతగా చేయడం వల్లనే వితంతు వివాహ సమస్య ఇలా అల్లరిపాలైంది అనే విషయంకూడా నాటకంలో స్పష్టంగా అర్థమౌతుంది. మొత్తం నాటకానికి గిరీశంను కథానాయకుడని అనవచ్చునా లేదా అనే విషయం వివాదాస్పదమని అనుకున్నా, నాటకంలోని వితంతు వివాహ సమస్యకు మాత్రం అతనే కథానాయకుడని ఒప్పుకోక తప్పదు. అతను కథానాయకుడైనాడు గనుకనే ఆ సమస్య అలా భ్రష్టు పట్టింది. నాటకంలో గిరీశం (కథానాయకుడు కాదనుకున్నా) ఒక ముఖ్యమైన పాత్ర కావడం యాదృచ్ఛికమేమీకాదు. గిరీశం లేకపోతే (గిరీశం మరొక విధంగా వున్నా) నాటక స్వభావమే మారిపోతుంది. కనుక నాటకంలో అతని పాత్రను ప్రధానమైందిగా అంగీకరించక తప్పదు.

యేదైనా ఒక సమస్యమీద నాటకం రాయదలచుకున్న వాళ్ళకు మామూలుగా వున్నవి రెండు పద్ధతులు— ఒకటి మోదాంతం (కామెడీ), మరొకటి విషాదాంతం (ట్రాజెడీ) వితంతు వివాహానికి అనుకూలంగా ప్రచారం చేయదలచినవాళ్ళు ఆ సమస్యమీద మోదాంత నాటకం రాయదలచుకుంటే ఒక నాయకునీ, వితంతువైన ఒక నాయికనూ సృష్టించి, వాళ్ళు పెండ్లి చేసుకోడానికి ప్రయత్నించినట్లూ, ఆ ప్రయత్నంలో వాళ్ళకు కొన్ని కష్టాలు యెదురైనట్లూ, చివరకు ఆ కష్టాలన్నీ అధిగమించి వాళ్ళు పెండ్లి చేసుకొని సుఖపడినట్లూ నాటకం రాస్తారు. లేదా పెండ్లి చేసుకొన్న తర్వాత తత్ఫలితంగా కొన్ని కష్టాలు యెదురైనట్లూ, చివరకు వాటిని అధిగమించి వాళ్ళు సుఖపడినట్లూ నాటకం ముగియవచ్చు. యేమైనా మోదాంత నాటకంలో పెండ్లి జరగాలి, తత్ఫలితంగా నాయికా నాయకులు సుఖపడాలి. విషాదాంత నాటకమైతే నాయికా నాయకులు పెండ్లి ప్రయత్నంలో గానీ, పెండ్లిచేసుకున్న తర్వాత గానీ, సమాజంలోని దుష్టశక్తుల మూలంగా తిరుగులేని దురవస్థకు గురౌతారు. కానీ, నాయికా నాయకులు ప్రేక్షకులకు ప్రీతిపాత్రమైన వ్యక్తులుగా వుంటారు. గనుక వితంతు వివాహ సమస్యకు అనుకూలమైన ప్రచారం జరుగుతుంది.

నాటకం మోదాంతమైనా, విషాదాంతమైనా సమస్యకు అనుకూల ప్రచారం జరగాలంటే నాయికా నాయకులమీద ప్రేక్షకులకు అభిమానమూ, సానుభూతీ యేర్పడాలి. అనగా వాళ్ళు సజ్జనులుగా, సద్గుణవంతులుగా వుండాలి. యిది తప్పనిసరి. (అలంకార శాస్త్రాల్లో చెప్పిన ధీరోదాత్తులూ, ధీరలలితులూ కానక్కరలేదు.

ఆంధ్రా అసోసియేషన్, సౌత్ ఢిల్లీ.

పురోహితుడు వాళ్ళదగ్గర లంచం పుచ్చుకుని, పుస్తె కట్టలేదని సాక్ష్యమిచ్చాడు. దాంతో కేసు పోయింది. కాని దాన్నెవరూ పెళ్ళాడారు కారు."

2. 17 వ పేజీలో, కరటకశాస్త్రి, ప్రసంగవశాత్తూ బావమరిదితో "చచ్చాడంటే వాడిదా తప్పు? మంచం మీంచి దించెయ్యడానికి సిద్ధంగా వున్నవాడికిచ్చావ్"- అంటాడు.

3. 85 వ పేజీలో లుబ్ధావధాన్లు, "డబ్బుచ్చుకున్న తరువాత చచ్చిన శవానికైనా కట్టక తప్పదు" అని అశోక హక్కులాగున చెప్పి సంఘంయొక్క అధో స్థితిని వెల్లడిచేస్తాడు.

4. 110 వ పేజీలో గిరీశం "నీ మొగుడు నిన్ను పెళ్ళాడి యెంత సుఖపెట్టాడో, మా అన్న నీ చెల్లెలిని పెళ్ళాడి, అంతే సుఖపెడుతాడు .. .... మా అన్న మీ చెల్లెలిని పెళ్ళి అనే మిషపెట్టి కొంటున్నాడు. వాడింట యిది జీతంలేని బాపనక్కలాగు పనీపాటు చేస్తుందని వాడి ఆశ.

5. 188 వ పేజీలో నాయుడు ప్లీడరు, అగ్నిహోత్రావధాన్లను గురించి చెబుతూ, "పల్లవరంలో సహస్రసమాజీపైన ఒక బ్రాహ్మణ శ్రేష్ఠుడుంటే, ఆయనకు తన పెద్ద కుమార్తె (బుచ్చమ్మ) ను కన్యాదానం (!) చేసి, రెండు పిల్లికూనలు స్వీకరించే టప్పటికి, పెళ్ళిలోనే, ఆ బ్రాహ్మడి పుణ్యమంతా మూడి, పరంపదం వేంచేశాడు! అని తన బ్రహ్మద్వేషం వెల్లడి చేస్తాడు.

ఇవికాక నాటకం నిండా బాల్యవివాహాలకూ, కన్యాశుల్క స్వీకారానికీ, అన్వయాలు అనేకం అడుగడుగునా ఈ సంఘ దురాచారాన్ని ఎత్తిపెడుతూ నాటకం "కన్యాశుల్కం" మనే పేరు సార్థకం చేసుకుంది.

ముగింపు : ఆంధ్ర సారస్వతంలో కన్యాశుల్కానికే స్థానం?

ఈ ప్రశ్నను విచారించడానికి పూర్వం కన్యాశుల్కం గురించి ఆనాటి పత్రికాభిప్రాయములు కొన్ని పేర్కొంటున్నాను.

1. He has likewise shown unmistakable merit in constructing a singularly original and interesting plot and creating a variety of characters true to life, we are sure, if represented on the stage, will greatly please any Telugu audience, ... the whole piece is very happily put together and constructed, evincing no little originality and dramatic skill on the part of the author.

—The Peoples Friend: January 21, 1897.

2. It holds the mirror upto nature.

—The weekly Review: March 27, 1897.

3. The piece, besides displaying much incident and humour, possesses the very necessary elements of characterisation, a trait often conspicuous by its absence in our old plays.

—The Telugu Harp

4. The play has been acted several times, and Judging from the large audience which crowded the theatre on each occasion, the author must be congratulated upon the success which the exhibition of his work produced.

—The East Coast News.

5. A carefull study of the book is sure to bring home to the mind of the reader the need for social reform ... ... ... May this work which is intelligible to the masses, spread all over the country, and help the cause to social reform.

—Chintamani.

పరిపూర్ణమైన విమర్శవలనను పత్రికాభిప్రాయముల వలనను నాటకమొక అపూర్వమైన సృష్టియని గోచరము కాకతీరదు. జీవకళలుట్టిపడునట్టి పాత్రలు, పామరులను సైతము రంజింపజేసే సులభమైన వెన్న బెట్టిన భాష, సుగమంగా సాగిపోతూన్న శైలి, భావ గర్భితమైన పదజాలంతో కూడుకున్న భాష, చమత్కారమయిన కథాకల్పన, నాటకరచనలోని బింకము, కథపట్టుల గమనము, వివిధ భాగముల ఐక్యత, సర్వవిధ సంపూర్ణత్వము మున్నగు గుణాలు చూస్తే కన్యాశుల్కం అన్నివిధాలా ఉన్నత శ్రేణికి చెందిన నాటకరాజమని చెప్పక తప్పదు. అట్టి అభిప్రాయమునకు రానివాడు ఆంధ్రదేశంలో వున్నాడంటే నమ్మడానికి వీలులేకుండా యున్నది. పాత్రలచుట్టూ తదుచితమయిన వాతావరణాన్ని కల్పించి ఆ మధ్యను పాత్రను స్పష్టీకరించడములోను, ఆయా పాత్రల నైజగుణాలను చిత్రించడములో నైతేనేమి శ్రీ అప్పారావుగారు ఒక గొప్ప 'శిల్పి' (Artist) అని చెప్పితీరాలి. అందరినీ రంజింపచేయడమే సారస్వతం యొక్క ముఖ్య ధర్మం అని మనం ఒప్పుకొంటే- కన్యాశుల్కం పండితులను, పామరులను, స్త్రీలను, పురుషులను ఆబాలగోపాలాన్ని ఆనందపరచింది- ఆనందపరుస్తూన్నది. ఇకముందు ఆనందపరుస్తుంది. విస్పందేహంగా ప్రాపంచిక వ్యాపారాలను, మానవ చిత్త వృత్తులనూ, చూపరులకు సరియైన దృక్పథంలో నిలిపి నిరూపించడమే సారస్వతానికి ముఖ్య ఆదర్శముకదా ! ఈ ప్రమాణాన్నిబట్టి కన్యాశుల్కంతో పోల్చవలసిన నాటకము ఇంకేదికలదు ? నాటకమై అద్భుతమగు రచనా కౌశలముతో కూడుకొని ఉచ్చశ్రేణి నాటకమనిపించుకున్నది మన కన్యాశుల్కం. సారస్వతమై ప్రకృతికి దర్పణమై తి ఆంధ్ర సారస్వత లోకంలో ఉన్నత స్థానానికి హక్కు నేర్పరుచుకున్నది, ఆంధ్రుల కన్యాశుల్కం. ఆంధ్రుల నిత్య నైమిత్తిక జీవనంలో మనం రోజూ చూచే సంఘటనలూ, మనం ఎల్లప్పుడూ వింటూన్న పదాలు మన వేషాలు, మన ముద్దు భాష, మన వ్యాపారాలు, మన ఊహలు అన్నీ తన ముందు ఇముడ్కొని వ్యక్తంచేస్తూ ఆంధ్ర విజ్ఞాన ప్రపంచములో ఆదర్శప్రాయకమై నిలిచింది శ్రీ గురజాడవారి కన్యాశుల్కం.

ఇట్టి ఉద్గ్రంథాన్ని రచించిన కవిశేఖరుడు ఇట్టి అపూర్వ కావ్యాన్ని సృష్టించిన కవిబ్రహ్మ శ్రీ గురజాడ అప్పారావుగారు—అస్తమించినారు. కాని విచారంలేదు ఎందుచేతనంటే, శాశ్వతంగా తమ నామాక్షరాలు ప్రతి ఆంధ్రుని హృదయంలోనూ — ఆంధ్రావనియందన్న మాట— స్థిరస్థాయిగా ఉండేటట్టు కన్యాశుల్కం మూలాన్ని చేసికొన్నారు. ఆ ప్రతిమాన ప్రతిభావంతమైన ఆంధ్ర గ్రంథాన్ని—కన్యాశుల్క నాటకాన్ని— ఆంధ్రుల కందిచ్చి దివికేగినారు. వారి ఆత్మ నేడు సర్వేశ్వరుని శాంతిధామంలో విహారం చేస్తూంది, ఆనందముగా.

"తస్మిత్ ప్రీతిః, తస్యప్రియ కార్యసాధనంచ తదుపాసనమేవ."

అతనియందు శ్రద్ధ, అతని కిష్టమైన కార్యములు సాధించుట — ఈ రెండే అతని సేవ యగును.

అనగా అతని అడుగులలో అడుగులు వేయుచు, అతని యాదర్శములను జ్ఞప్తియందుంచుకొని, భాషా సేవ చేయుటయే మన మాతనియెడ జూపవలసిన గౌరవము. అదియే శ్రీ గురజాడవారి యాత్మకు శాశ్వతమయిన శాంతి నాపాదించగలదు.

'ఓం, తత్, సత్'

(పునర్ముద్రణ: భారతి – 1940 – జూన్, జులై, ఆగస్టు, సెప్టెంబరు సంచికల నుండి.)

"ఇదీ ఉత్తమమైన రాజమార్గమని దేనిని బుద్ధుడు మనకు ఉపదేశించాడో, అదే నిజమైన ఉన్నతమైన ప్రేమ! మానవ జాతికై మనకు ఉండవలసిన ప్రేమ! ఏనాడు బౌద్ధమతం భారతదేశంలో తుడిచిపెట్టబడిందో ఆనాడే భారతదేశం మత విషయిక ఆత్మహత్య చేసుకుంది."

—గురజాడ.

"చిన్నతనంలో బొమ్మలాట నేర్చి వుండుటచేత లోకమనే రంగంలో చిత్రకోటి రీతులను ఆటాడే మనుషులనే పాత్రముల సొగసునే కనిపెట్టడము నాకు అలవాటైనది."

—గురజాడ

"గురజాడ కేవలము కవిపండితుడే కాక గొప్ప భాషావేత్త."

—నిడదవోలు వేంకటరావు

"గురజాడ అప్పారావు తెలుగు సారస్వతానికి సరిహద్దు."

—ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి

### ఆశయంగా చూపించతగినది

# మానవుడి ప్రేమ

**—గుడిపాటి వెంకటచలం**

1936 వ సంవత్సరం ఫిబ్రవరి 27 వ తారీఖు 'హిందూ' పత్రికలో గురజాడ అప్పారావు గారి మిత్రులైన ఓ. యమ్. సుబ్రమణ్యంగారు వ్రాసిన వ్యాసంలో అప్పారావుగారు ఆయనకు వ్రాసిన ఉత్తరాల్లో కొన్ని భాగాలు ప్రచురించారు. అవి 1909 వ సంవత్సరంలో వ్రాసినవి. వాటిని చదివితే అప్పారావుగారికీ నాకూ కనబడ్డ అభిప్రాయ బంధుత్వాన్ని చూసి ఆశ్చర్యపడ్డాను. నా అరణ్య రోదనం ప్రారంభం కాకమునుపే, కొన్ని సంవత్సరాల కిందటే, రోదనం లాభంలేదని తెలిసిగావును, స్నేహితులకీ ఉత్తరాలు వ్రాయడంలో తృప్తి పొందాడు. ఆయన కూడా నావలెనే అవాచ్యుడంటే ఆయనతోబాటు నాకూ కొంచెం గౌరవం వస్తుందో లేక నాతోబాటు ఆయన పేరూ అథోలోకానికి పంపుతారో ! ఎట్లానైనా ఆయనతో కలిసిన పతనం గౌరవప్రదం.

ఎందుకంటే, ఆయన పద్యాలమీద నాకు ప్రత్యేక గౌరవముంది. ఆయన లేఖలు – ఆ యింగ్లీషును తెలుగు చెయ్యడం చాలా కష్టమనిపించింది. ప్రయత్నించాను.

"కన్యాశుల్కం ప్రూఫులు దిద్దుతున్నాను. చదువుతోంటే నాకు ఆహ్లాదం కలుగుతోంది. గ్రంథకర్త తన పుస్తకాల్ని చదివి తానే ఆశ్చర్యపడితే గ్రంథంలో నిజమైన స్వారస్యం వుందన్నమాటే. గ్రంథకర్తకే పుస్తకం ఆకర్షకంగా వుంటే అందరికీ వుంటుందని నిశ్చయమే. మీనాక్షి వొచ్చిన రంగాలు చాలా జ్ఞానా పాదకాలుగా వున్నాయి. నేను పూర్వ గ్రంథాల్లోంచి ఉదాహరణ లివ్వగలను.

(కళా దృష్టితో ఆదర్శవంతంగా) చేసినప్పటికీ **Artistic Idealisation** కూడా **Realistic** (ఉన్నదున్నట్టు)గా వ్రాసినట్టయితే ప్రజల నీతి అభిప్రాయములకు విరుద్ధంగా వుండే ఘట్టాలు తటస్థించక మానవు. కొంతవరకు నైతిక ఖండనం ప్రత్యేక తత్వాలమీద ఆధారపడి వుంటుంది. మీజాతి పట్టాభి రామమూర్తిగారి సహవాసంలో మీరు పెరగడంవల్ల మీకు అవినీతి అంటే కంటకమని నాకు తెలుసు. వేశ్య అనేసరికి అదిరిపడతారు.

కావ్యాల్లోని న్యాయస్మృతి **Poetic justice** (కావ్య న్యాయం) లో మారింది. నేను జీవితాన్ని చిత్రిస్తున్నాను. కళాపరంగా కొంత ఔన్నత్యాన్నిస్తాను.

నేను కళారాధకుణ్ణైనప్పటికీ సంఘం యెడల బాధ్యత వుంది నాకు. నా పుస్తకం చదివేవారు నన్నొక ప్రశ్న వెయ్యవచ్చు; నేను దుర్మార్గాన్ని ఆకర్షణీయంగా చేశానా అని. చెయ్యలేదని నా నమ్మకం. మొదటి ముద్రణలో మధురవాణి జీవంలేని ఘోరంగా తయారైంది. ఈ ముద్రణలో ఆమెని పూర్ణంగా చిత్రించాను. నేనే ఆమెనిచూసి భ్రమసి పోతున్నాను. కనక ఆమెని చివర రంగంలో

సంస్కరణం చేశాను. ఇంక మీకు అభ్యంతరం వుండకూడదు.

పైకి కనబడేదానికన్న బలమైన నైతిక భావాన్ని పొందింది నా పుస్తకం. జీవితాన్ని నేను చులకనగా భావించనని తెలుస్తుంది. హాస్యంతో పొంగిపొయ్యే పుస్తకంలో జీవితంలో గంభీరత్వాన్ని చూపడం చాలా కష్టమైన పని. ప్రయత్నించాను నేను.

వేశ్యలోని మానుషత్వాన్ని మరచిపోకండి. ఆమె సుఖదుఃఖాలు మీవిగానీ, నావిగానీ అయిన సుఖదుఃఖాలకు ప్రాముఖ్యతలో తీసిపోవు. సంఘంలో లెఖ్ఖలేని వ్యభిచారులైన భర్తలూ, భార్యలూ వున్నారు. స్పష్టంగా తన వృత్తిని తెలియబరిచే వేశ్య వారందరి కన్న అధమురాలెట్లా అవుతుంది. పైగా వేశ్య వివాహ ప్రమాణాన్ని భగ్నం చెయ్యడం లేదు వీళ్ళవలె.

'ఆంత్రోపాలజీ' (పురాతన మనుష్యుల చరిత్ర నుంచి తెలుసుకునే శాస్త్రం) వల్ల మన సాంఘికాభిప్రాయాలు మార్చుకోవలసిన అవసరం కలిగింది. స్పష్టంగా గోచరించే విషయాన్ని కప్పిపుచ్చడంవల్ల ఏమీ లాభంలేదు.

వివాహ (Sexual) బంధాలను ఇంతగొప్ప చెయ్యడంలో అర్థమేమిటి? సాంఘిక పరిణామంలో వివాహ సంస్థయొక్క ప్రాముఖ్యతను నేను తగ్గించ చూస్తున్నాననుకోకండి. గడిచిన శతాబ్దంలో ప్రపంచం జ్ఞానంలో చాలా మారింది. వివేకవంతులైన మనుష్యులు పాత అభిప్రాయాల విలువను పరీక్షించడం ప్రారంభించారు. వివాహసంస్థ మానవాభివృద్ధికి తోడ్పడినమాట వాస్తవమే కాని వివాహబంధం భేదించకూడదనే అభిప్రాయంవల్ల ఎన్ని చెప్పతరం గాని దారుణ కృత్యాలు తటస్థిస్తున్నాయో మరవకూడదు. అంతేకాదు. ఇంగ్లీషువారిలో పెళ్ళి (సివిల్ కాంట్రాక్టు) చట్టసంబంధమైన ఒడంబడికగా వుంది. షెల్లీ, జార్జి ఇలియట్ దాన్ని తోసేసి తిరిగారు. (Modern Woman will rewrite history). నవీనయుగపు స్త్రీ చరిత్రను పునర్లిఖింపబోతోంది.

గొప్ప నవలలో ప్రేమ కథ అపురూపమవుతోంది లేక ప్రాముఖ్యతలేని స్థానానికి వెడుతోంది. ఈ స్త్రీ పురుష శరీర ఆకర్షణ విషయమై వాఙ్మయం ఎందుకు అనంతమైన భేదాలతో చిత్రిస్తుంది? కామ (Sexual) సంబంధమనే మాటను గమనించండి. శుద్ధ శరీర సంబంధాన్ని స్పష్టంగా చూపుతోంది. వాడిలిపోయిన యాభై ఏళ్ళ సుందరిని యువకు డెందుకు మోహించడు? చక్కగా వికసించిన రోజా పువ్వువలె, బాగా పుడికే కూరవలె యవ్వనవంతురాలు యింద్రియాల్ని ఆకర్షిస్తుంది. పాచిన ఆహారం గాని, వాడిలిన పువ్వుగాని ఎంత అయిష్టమో ముదిరిన స్త్రీ కూడా అంతే. ముందెప్పుడో రొట్టె పాచిపోయుందనిగాని, రోజా వాడిలిపోతుందనిగాని అవి కొత్తగా, మనోహరంగా వున్నప్పుడు ఎవడన్నా అనుభవించడం మానుకుంటాడా? జీవితమూ, సౌందర్యమూ అశాశ్వతములనే వేదాంతం సరైనది కాదు. పైగా తరుణమందే అనుభవించాలనే అభిప్రాయానికి బలమైన ప్రోత్సాహకారణమౌతుంది. పాపం అమితత్వంలో వుంది. అమితత్వం ఎక్కువకాలం ఎట్లాగూ దాగదు.

జీవితంలోనూ, వాఙ్మయంలోనూ కూడా మోహం తన ఉచిత స్థానాన్ని అధిష్ఠించాలి. ప్రస్తుతం దానికి అమితమైన ప్రాముఖ్యాన్నిస్తున్నారు. 'కేటో' తన భార్యని ఎవరికో ఎరువిచ్చాడు. పురాణాలు చదవండి తెలుస్తుంది.

నిజంగా జరుగుతున్న సంగతుల్ని చూడాల్సి వొస్తుందని కళ్ళు మూసుకోవద్దు. డాక్టరులాగు కత్తి తీసి పుండుకోసి పరీక్షించాలి. ఆశయంగా చూపించ తగినది మానవుడి ప్రేమ. క్రైస్తు బోధించిందిగాని, బోధించాడని అనుకునేదిగాని అదే. తన కవిత్వంలో షెల్లీ చాటింది ఆ ప్రేమే. జీవించే మతంకింద

బుద్ధుడు బోధించింది ఆ ప్రేమనే. బౌద్ధమతాన్ని యేనాడు నాశనంచేసిందో అనాడే హిందూదేశం మతీయమైన ఆత్మహత్య చేసుకుంది.

ఈ ఆచారాలనే యెర్రకాంతిని పరిశోధనాలయం (laboratory) నుంచి తొలిగించి, యీ కామ సంబంధాన్ని పూర్తిగా, వివరంగా పరీక్షించాలని నా కోరిక. చరిత్రాత్మ జీవశాస్త్రాత్మకంగా (biologically) పరీక్షించి, దాని సరియైన స్థానాన్ని యీ కామానికి ప్రసాదించి తీరాలి. జీవితంలో యదార్ధాన్ని మీరు ప్రేమిస్తున్నారు. 'సెన్టిమెంటు' లోని యదార్ధాన్ని యెందుకు ప్రేమించరు? పురుషుడి అధికారం కింద యెంత నీచమైన బానిసత్వాన్ని స్త్రీ అనుభవిస్తోందో నాకు తెలుసు. మీరు మాత్రం ఆలోచించుకోలేరా?

పేదలూ, కురూపులూ, దుర్మార్గులూ, బలహీనులూ ఐన భర్తల విషయమై ఆ భార్య లేమనుకుంటూ వుంటారో ఆలోచించుకోండి. మీచుట్టూ కనపడే కుటుంబాలను 'స్టడీ' చెయ్యండి. కురూపులూ, దుర్మార్గులూ, బలహీనులూ ఐన భార్యలో? అంటారు మీరు. కాని వారు పురుషుల బానిసలేకద. మనకన్న ఆడవాళ్ళు ఎక్కువ పవిత్రత చూపాలని విధిస్తున్నాము. దానివల్లనే యింత వ్యత్యాసం కలుగుతోంది. నిర్మలులుకాని పురుషులందరినీ మీరు ద్వేషిస్తారనుకోండి పనిబట్టి. ఇంక మీరు ద్వేషించని స్నేహితులు ఎంతమంది మిగులుతారు? స్త్రీకి సాధ్యమైన దానికన్నా ఎక్కువ ప్రజ్ఞను పురుషుడు కోరుతున్నాడు గనక స్త్రీ బాధపడుతోంది. తన మనసు తీరేట్టు, స్త్రీ తనని పూజించడం లేదని పురుషుడు దుఃఖభాజనుడైనాడు. 'జెలసీ' అంటే యేమిటి? భర్త అందంగా లేడు. భార్య అతని రూపాన్ని యెట్లా మెచ్చుకుంటుంది? అందంగావున్న పరపురుషుడి యెడల అనురాగాన్ని ఆపుకోలేదు. కాని అట్లాంటిది మహాపాతకమంటారు మీరు. ఎంత దుస్సాధ్యం? భర్త చవట అయినా భార్య మాత్రం ఆయన మేధాశక్తుల్ని మెచ్చుకునే తీరాలి. ఇట్లా ఎంతవరకన్నా. ఎన్ని విషయాల్లోనో వూహించుకోవచ్చు యీ అగచాట్లు.

జపానులో గెయిషా పద్ధతి సంగతి వినేవుంటారు మీరు. కామ విషయమైన నీతి జపానులో చాలా తక్కువ. కాని వారి జాతీయతకిగాని, మత జీవనానికి గాని, భాగ్యసమృద్ధికిగాని యే లోటూ రాలేదు. ఆశ్చర్యం యేమిటంటే, ఆ దేశంలోనే ముఖ్యంగా గొప్ప రాజకీయ ఆదర్శాలున్నాయి.

సెన్టిమెంట్ అవతలపెట్టి యీ కామవిషయమై నా అభిప్రాయం యిదీ. సంఘంవల్ల విధింపబడిన చట్టాలు వున్నాయి, వాటిని మన్నించడం మన విధి. కామవ్యవహారాన్ని శాంతంగా నడిపించేందుకు అవి వుండవల్సిందే.

ఆ చట్టాలు అన్యాయమని తలిచి వాటిని బహిరంగంగా సంస్కరింప పూనుకున్నపుడుతప్ప వాటిని మీరడం గొప్ప నేరం. ఆ చట్టాలకి లోబడివున్నా వాటిని పరీక్షించి వాటి న్యాయాన్యాయ విచారణ చేసేందుకు ప్రతివారికీ స్వతంత్రం వుంది. నిర్మలత్వం అవసరం అనే సెన్టిమెంటుని నేను మన్నిస్తాను. కాని ఆ సెన్టిమెంటు యొక్క నిజస్వభావమేమిటి, దాని హద్దులెంతవరకు, దాని అసలు అర్ధమేమిటి, అది ఏ మార్గంగా పని చేస్తోంది, నిర్మలత్వమంటే దేంటోవుంది? నేను నమ్ముతున్న దేమిటంటే ప్రస్తుత సాంఘిక శాసనాలు ఈ కామ విషయమై ఎవరికీ అందుబాటులో లేనంత కఠినంగా వున్నాయి. కనకనే నేరాలు మీరిపోయినాయి. మనలో మనం వాస్తవం చెప్పుకోవలసినకాలం వొచ్చింది. ఇదంతా ఎందుకు వ్రాశానంటే నేను వ్రాయబొయ్యే నాటకం యీ సమస్యల్ని గురించి."

—అని వ్రాశారు అప్పారావుగారు. ఆయనే బతికి వుంటే యిప్పటి నా వాఙ్మయ మిత్రులవలె గాక మనఃపూర్వక స్వాగతమిచ్చే వారేమో అనుకున్నాను.

"మీ భావాలతో ఏకీభవించకపోయినా, మీ స్థాయిలు వుండే...."

"మీ కథలు బావుంతవుగావి మీ శైలి మాత్రం...."

"మీ భాష అపభ్రంశంగావి విషయం మాత్రం..."

"మీతో ఏకీభవించంగావి, మీరు చూపే లోపాలలో కొన్ని...."

"విజమేగావి, ఇవి సంఘాన్ని అల్లకల్లోలం...."

"అన్నీ బావున్నాయిగాని, నీతి మాత్రం...."

—ఇట్లా గొణుగుతో, సణుగుతో వొప్పుకునే వాళ్ళూ, ఏదో వుద్రేకంలో ఉపోద్ఘాతాలు నే నడక్కుండానే వ్రాసి పశ్చాత్తాప పడేవాళ్ళూ, సన్నిష్టపడే వాళ్ళవద్ద పొగిడి, ఇష్టంలేనివాళ్ళ వద్ద తిట్టే వాళ్ళూ, "మనిషి ఫరవాలేదు గాని, ఆ వ్రాతలు" అనేవాళ్ళూ, "వ్రాతలతో ఆగితే బాగానే వుండును" అనేవాళ్ళూ—ఇట్లాంటి మిత్రులకన్న పడపడ దూషించే విరోధు లెంత ఉపకారులు ?

జీవితాన్ని చాలాసూక్ష్మంగా, ఆర్టిస్టిక్ గా పరిశీలించి కొత్త వాఙ్మయానికి పునాది వేశారని నీతిని మూట గట్టుకున్న పత్రికలే పొగిడాయి అప్పారావుగారిని : ఆయనను మెచ్చుకునేవాళ్ళలో చాలామందికి సరిగా ఆయన అన్నమాటలన్నీ నేను అన్నందుకే కోపం నామీద. నావలెనే ఈయన దృష్టి కూడా వ్యాధి గ్రస్తమేమో ! సంస్కరించేప్పుడు తప్ప సాంఘిక ఛట్టాల్ని మీరడం నేరమన్నారు అప్పారావుగారు. వివాహబంధాన్ని తృణప్రాయంగా మీరే వారందరూ సంఘ పూజ్యులే. సంఘానికి ముద్దు బిడ్డలు. ఇట్లా మీరే సంసార బంధం వల్ల లాభమేమిటనీ, యిట్లా మీర నవసరం లేకుండా మనుషులు దొంగలుకాకుండా సంస్కరించ మన్నవాడు సాంఘిక, వాఙ్మయ, నైతిక బహిష్కారాన్ని పొందుతాడు.

ఆ రెండో గ్రంథం ఆయన వ్రాయకపోవడం దేశానికి దురదృష్టమైనా ఆయనకి అదృష్టమేనను కుంటా. ఈ లేఖలు ఇప్పటివరకూ బైటికి రాక పోవడం కూడా అదృష్టమే. కాకపోతే ఆయనా, ఆయన పద్యాలూ, ఆయన నాటకం, ఆయన వంశం అన్నీ తిట్లపాలయ్యేవి కదా ?

('చలం'గారి "ఆనందం" వ్యాససంపుటినుంచి)

"వారి కన్యాశుల్కమందున్నంత హాస్యరస నైర్మల్యము తక్కిన యెవరి గ్రంథములందును లేదనుట యతిశయోక్తి కాదు."

—రాళ్ళపల్లి అనంతకృష్ణ శర్మ

"గురజాడ అప్పారావుగారు 1915 లో చనిపోయినా, 1915 తర్వాతనే జీవించడం ప్రారంభించారు."

—దేవులపల్లి కృష్ణశాస్త్రి

# A Word about ourselves

The South Delhi Andhra Association, the premier social and cultural organisation of Delhi Telugus, has been marching ahead from strength to strength, meeting their growing requirements. Thanks to the generous support extended to it by its patrons and wellwishers, the Association has intensified its activities, both quantitativley and qualitatively. It runs a large Telugu library, enacts Telugu plays, exhibits Telugu films and organises cultural functions.

Now it has taken the step of bringing into focus some of the aspects of Gurazada's contribution to mankind.

## RECENT ACTIVITIES

### Sankranthi

The "Sankranti" festival (13-1-1975) was celebrated with Justice P. Jaganmohan Reddy as the chief guest. He released a souvenir on that occasion. A Kuchipudi dance recital by Kumari Swapna Sundari was the highlight of the day.

### World Telugu Conference

The world Telugu Conference was commemorated in a fitting manner on April 12 & 13, 1975. The veteran statesman and former President of India, Sri V. V. Giri, inaugurated the celebrations and exhorted the Telugu public to redouble their efforts in realising their cultural values. Sri and Smt. K. Raghuramaiah and Dr. K. L. Rao were the distinguished speakers on the occasion. Two plays, 'Prema Vyuham' a social comedy, and 'Lepakshi', a historical play depicting the glory of the Telugu sculpture, were presented on that occasion.

### Dusserah Fesival

In collaboration with the Andhra Education Society, we organised a two-day Dusserah festival on October 13 and 14, 1975. Sports competitions were held for children from all over Delhi and 'Kanyasulkam' was staged.

### Gurazada Vardhanthi Celebrations

On November 30 1975, a seminar-cum-exhibition was organised on Gurazada Apparao. Detailed press reports of the above two events are published separately in this volume.

These major events were interspersed by picnics, one-act plays, music concerts etc.

### Films

The evergreen hits of yester years like MAYABAZAAR, APPU CHESI PAPPU

KUDU, PELLI CHESI CHUDU etc., screened by us were very popular with the Telugu public. We are screening the latest hits also occasionally.

### Theatre

We have made our debut in this year and staged five plays (Pattalu thappina bandi, Lepakshi, Prema Vyuham, Venkanna Kapuram and Kanyasulkam) attracting the attention and approbation of the theatre lovers of Delhi. This sustained activity became possible owing to the presence, in our ranks, of Shri S. Gopala Murthy, the talented 'regisseur' and Shri S. Anjibabu and Shri H. V. Sharma, the well - known artists.

### School

The Andhra Education Society, under the dynamic leadership of Shri Burra Venkatappiah, while proposing to start a new school in South Delhi, as part of its integrated development programme, thought it fit to harness the management with a band of our dedicated workers. Consequently a primary school started functioning from July 1975 with a well qualified team of teachers. The school has already made a name for itself.

### Library

The Telugu Library started by us in 1970 in the premises of Lajpat Bhavan as part of the Purushottamdas Tandon Library has acquired another 1,000 volumes in the recent past. With nearly 4,000 volumes on its shelves on a variety of subjects now, it is attracting the Telugu reading public from distant corners of Delhi.

We are extremely grateful to the doyen of Indian journalism, Shri M. Chalapathi Rau, who has, in spite of his indifferent health and pressing engagements, agreed to be the Hon. editor of this volume.

**C. V. S. Ratnam,**
President.

**P. V. Dass,**
Secretary.



# A TRIBUTE TO A STALWART

( 1934 - 1977 )

The Telugu Community of Delhi was shocked by the sudden and untimely demise of Shri P. V. Das, Secretary of the South Delhi Andhra Association, on the evening of February 7, 1977. Besides his wife and three children, he left in great sorrow innumerable friends and acquaintances and members of the Telugu Community.

Shri Das was actively associated with our Association for over a decade. He became our Secretary over two years ago. His tenure as Secretary of the Association has seen the unprecedented growth of this organisation, contributing to the cultural needs of Telugus in this part of the country. Many new activities were undertaken by the Association during this period.

Shri Das stood by the Association through thick and thin and his support to the organisation was of great help in carrying out its activities.

Shri Das was a gentle person with sober manners and he endeared himself to one and all. He never shirked from his duties and cheerfully carried out whatever work was given to him inspite of his indifferent health. He was a good editor and was practically incharge of all the publication work of the Association. He was Joint Editor of "Co-operator" at a very early age. It will be very difficult to replace a man of his talent and aptitude for work.

The loss which his family has suffered is irrepairable. So is the loss to the Association and the Telugu Community. I join the members of the Association and other Telugu friends in Delhi and elsewhere in sending our heartfelt condolences to his wife Smt. Kasturi and children.

May his soul rest in peace.

G. V. S. Ratnam

*President:*
**SOUTH DELHI ANDHRA ASSOCIATION**

# Press Reports of our Dusserah Celebrations

## *DELHI ANDHRAS PRESENT "KANYA SULKAM"*

**New Delhi Oct. 18.**

The South Delhi Andhra Association and the Andhra Education Society, New Delhi, celebrated Dasara in the Mavlankar Auditorium here with traditional gaiety and enthusiasm. Mr. T. V. R. Tatachari, Chief Justice, Delhi High Court, was the Chief guest while Mr. Burra Venkatappaiah, Chairman, Andhra Education Society, presided ove the function.

Mr. S. V. R. Rao, Secretary, Andhra Education Society, in his welcome speech explained the activities of the Society.

Mr. Burra Venkatappaiah said that the Education Society in collaboration with the local Telugu organisations, was taking steps to promote the educational and cultural aspects of the Telugu people, living in the Capital

He informed that the organisations will collect donations in cash and kind to help the flood victims in Bihar State. He appealed to individuals and voluntary associations to generously help the cause.

Chief Justice Mr. Tatachari, complimented the South Delhi Andhra Association and the Education Society, for taking active interest in projecting the Telugu culture in the Union Capital.

He said that presentation of dramas like 'Kanya Sulkam' would not only highlight the culture of the State, but also perpetuate the cultural heritage of the Telugu people. He expressed his hope that the Andhras in Delhi would contribute and strengthen the cultural and emotional integration of our country.

Smt. Tatachari distributed prizes to the winners in sports and games conducted by the South Delhi Andhra Association.

A highlight of the day's programme was staging of the Telugu drama– 'Kanya Sulkam' a social satire, written by the father of the modern Telugu literature, late Mahakavi Gurazada Apparao.

The drama was presented by the South Delhi Andhra Association under the able direction of Mr. S. Gopala Murthy.

Kum. R. T. Rama as Madhuravani
Mr. C. L. N. Sastry as Ramappantulu.
Mr. G. Krishna Rao as Gireesam.

Mr. M. Panduranga Rao as Agnihotravadhanulu.
Smt. M. Kusuma as Venkamma.
Mr. S. A. R. Murthy as Karataka Sastrulu.
Mr. S. V. S. Bangaram as Venkatesam.
Smt. A. Rajamani as Butchemma.
Mr. B. V. Chlapathi Rao as Sishyudu.
Dr. K. Ramesh Babu as Lubdhavadhanulu.
Dr. (Smt) K. Karuna as Meenakshi.
Mr. K. Satish Babu as Asirigadu.
Mr. V. Hanumantha Rao as Head Constable.
Mr. B. Sridhara Rao as Gavarayya.

displayed great histrionic talents and lived their respective characters.

The make-up by Mr. S. Anjibabu brought authenticity to the characters of those days. The packed audience thoroughly enjoyed the drama for about two and a half hours. Mr. P. V. Dass, Secretary, South Delhi Andhra Association, proposed a vote of thanks.

THE DECCAN CHRONICLE,
Secunderabad 19-10-75.

# Press Reports of our Gurazada Vardhanthi Celebrations.

## REMEMBERING GURAZADA

The South Delhi Andhra Association celebrated the 60th death anniversary of Gurazada Appa Rao, the poet and writer considered to be the father of modern Telugu literature.

An exhibition of works, on and by Gurazada who liberated the language from an archaic, obsolete and pedantic framework imposed by tradition-was organised. Photos, sketches and an oil painting of Gurazada added lustre to the exhibition. It was inaugurated by C. Rajeswara Rao, General Secretary of the C. P. I. A seminar, highlighting the various aspects of Gurazada's works was also organised. Dr. C. V. S. Ratnam, President of the association, M. Pandu Ranga Rao, joint secretary, and others participated.

Gurazada's genius is vividly reflected in his masterpiece, 'Kanya Sulkam,' a social satire on hypocritical matrimonial customs that go under the name of tradition and social prescription. The amateur group of the South Delhi Andhra Association presented the play in the evening. Director S. Gopala Murty edited the lengthy play into one, running for two and-a-half hours, without the main theme or its fine humour suffering.

***LINK - 14-12-75.***

## G. Appa Rao- Crusader through his pen

Tributes were paid on Sunday to celebrate Telugu playwright, poet and short-story writer. Gurazada Appa Rao, on his 60th death anniversary.

Opening an exhibition of books, manuscripts and photos of Gurazada, CPI General Secretary C. Rajeswara Rao said Gurazada was a great visionary who fought for social reforms, secularism and emancipation of women. Gurazada - a humanist to the core - waged a relentless battle against oppressive social customs and superstition through his writings. His well-known play 'Kanya Sulkam' (1897) was a strong indictment of society.

Mr. Rao recalled Gurazada's message that "Country means people, not land" and said that the message was as relevant today as it was 80 years ago. It was a tragedy that in Andhra Pradesh where Gurazada spoke of unity and equality, there should be two agitations for a division of the State, The message of Gurazada was universal and youth should fight against parochialism.

Later, inaugurating a seminar on the life and literature of Gurazada, Justice Tatachari said Gurazada was fired by the spirit of social reform and the desire

to write in spoken language to enable the masses to understand his plays, short stories and verses. In a scholarly analysis of Gurazada's work and the influence of English literature on it, Mr. B. Venkatappaiah, said Gurazada was not a prolific writer but whatever he wrote was qualitatively good. He was a literary genius and poineer in many ways. To understand his plays and other writings it was necessary to know the "man, the moment and the milleu". He also introduced, for the first time in Telugu literature, several practical innovations, he said.

## PURPOSEFUL

Dr. I. Panduranga Rao and Mrs. K. Rajeswari dwelled at length on the simplicity of Gurazada's style and diction, the profundity of his thought and noblity of his message. His purposeful writings had left an indelible mark on the people's mind and heart.

Mrs. V. S. Rama Devi said Gurazada was a revolutionary who fought for the emancipation of women and Mr. H V. Sharma examined in depth the fundamental aspects of the Gurazada literature and Mr. T. R. Rao read out an American scholar's assessment of Gurazada. Mr. M. Rajeswara Rao spoke on Gurazada as an artist.

In the evening, the South Delhi Andhra Association, which organised the programme, staged the play 'Kanya Sulkam'.

***PATRIOT - 1-12-'75.***

# ఢిల్లీలో 'కన్యాశుల్కం' నాటక ప్రదర్శన - ఒక సమీక్ష

**— శ్రీకాంత్**

దక్షిణ ఢిల్లీ ఆంధ్ర సంఘంవారు మహాకవి గురజాడ అప్పారావుగారి 'కన్యాశుల్కం' నాటకాన్ని ఢిల్లీలో రెండుసార్లు ప్రదర్శించారు. మొదటిసారి దసరాపండుగ (13-10-1975) సందర్భంగా మవ లంకర్ ఆడిటోరియంలోనూ, రెండవసారి తాము నిర్వహించిన గురజాడ అరవయ్యో వర్ధంతి (30-11-75) సందర్భంగా ప్యారేలాల్ భవన్‌లోనూ ప్రదర్శించారు.

ఆనాటి సమాజంలోని కుళ్లును, - బాల్య వివాహాలు, వితంతువుల హైన్యం, దొంగ సంస్కర్తలు, కోర్టుపక్షులు, సామాన్యుల మౌఢ్యం - అంతనూ ఈ నాటకంలో గురజాడవారు ఎత్తి చూపారు. ఈ దుర్భరమైన విషాదాన్నికూడా తన అద్భుతమైన హాస్య చమత్కారధోరణిలోనే గురజాడ చూపించారు. ముక్కుపచ్చలారని తన కూతురును కాటికి కాళ్ళు చాచుకున్న వృద్ధు లుబ్ధావధాన్లకు అమ్ముతుంటే అంగీకరించలేక వారించలేక నూతిలోపడ్డ వెంకమ్మ, చెల్లెలి పెండ్లి తప్పిపోతుందనే ఆశతో లేచిపో సాహసించిన బుచ్చమ్మ, ఆచార నిర్బంధాలలో ఇమడలేక చీటికి మాటికి ప్రాణంమీదికి తెచ్చుకుంటూ సాంఘిక నిబంధనలను అసహ్యించుకునే మీనాక్షి, వేశ్యగా పుట్టి, పెరిగీ మానవతను మేధను పెంపొందించుకుని కూడా వృత్తి కట్టుబాట్లు దాటిపోలేని మధురవాణి మొదలైన పాత్రలద్వారా నాటి సమాజపు విషాద బీభత్స రూపాన్ని గురజాడ తన నాటకంలో ప్రతిబింబించారు. కాని దురదృష్టవశాత్తు ఇంతకు ముందు ఈ నాటకాన్ని ప్రదర్శించిన ప్రముఖనటులు, సమాజాలు చాలావరకూ అప్పారావు గారు తొడిగిన హాస్యపు ముసుగును మాత్రమే వాడుకున్నారు తప్ప దాని క్రింద అణగివున్న విషాదాన్ని ఎత్తి చూపే ప్రయత్నం చెయ్యలేదు,

ఈ ప్రదర్శనను నిర్వహించిన దర్శకులు శ్రీ గోపాలమూర్తి నాటకంయొక్క విషాదస్వరూపం ప్రస్ఫుటమయ్యేట్లుగా, రెండున్నర గంటలకాలంలో ముగిసేటట్లు, క్రమం చెడకుండా, ఇతివృత్తానికి భంగం రాకుండా కూర్పు (edit)చేశారు. ప్రముఖంగా కనిపించే గిరీశం పాత్రని బాగా కుదించారు. కాని ఆ పాత్ర తన విలక్షణత కోల్పోకుండా జాగ్రత్తపడ్డారు. ఈ మధ్య ప్రఖ్యాత పాత్రికేయులు, రచయిత శ్రీ నార్ల వెంకటేశ్వరరావు గారు ఇదే నాటకాని ప్రదర్శనా సౌలభ్యం దృష్ట్యా చేసిన మార్పుకీ, దీనికీ చాలావరకూ పోలికలున్నా, కథనంలోనూ, నాటకీయతలోనూ, ఈ కూర్పులో మరికాస్త ఎండుదనం ప్రదర్శనా సౌలభ్యం ఉన్నవి.

దర్శకులు గురజాడవారి పాత్రల స్వభావాన్ని బాగా అర్థం చేసుకుని ప్రతి పాత్రధారికి చక్కటి అవగాహన వచ్చేట్లు చేయడం వల్ల నటులు రంగస్థలానుభవం లేకపోయినా తమతమ పాత్రలను చక్కగా నిర్వహించగలిగారు. అంతేకాదు, పాత్రధారుల ఎన్నికలో కూడా జాగ్రత్తగా చేశారు. ప్రదర్శనలో కొట్టవచ్చినట్లు కనబడే విశిష్టత ఏమిటంటే- సమిష్టి కృషి (team work).

'కన్యాశుల్కం' నాటకం ముగింపులో పరిష్కారం కలిపించదు, బుచ్చమ్మ శరణాలయం చేరుకుంటుంది, 'కథ అడ్డం తిరిగింది' అంటూ ఓటమిని అంగీకరించని గిరీశం, తన పరిమితులను గుర్తించిన సౌజన్యారావు పంతులు, మహోన్నత మానవి మధురవాణి, తిరుగుబాటు మనస్తత్వంగల మీనాక్షి– ఎవ్వరికీ రచయిత ఒక గమ్యాన్ని చూపరు. బహుశా నాటి సంస్కరణోద్యమం సరైన దారిలో లేదని ఆయన భావం కావచ్చు. ఈ దృష్టితో చూస్తే, నాటకాన్ని గిరీశం బుచ్చమ్మను లేవదీసుకుపోవడంతో ముగించటమే మంచిదిగా కనిపిస్తోంది.

శ్రీ అంజిబాబు ఆహార్యం (Make-up) శ్రీ హెచ్. వి. శర్మ రంగాలంకరణ నాటి ఛాందస వాతావరణానికి అద్దంపట్టి చూపినవా అనిపించేంతగా అలరించాయి. కాని దీపాలంకరణ సరిగ్గాలేదు. తెర ఏర్పాటు కూడా సమయానుకూలంగా లేదు. శ్రీ దివాకరరావు చక్కటి సంగీతాన్ని అందించారు. కాని అప్పుడప్పుడు అది ప్రేక్షకుల శ్రద్ధను తనవైపు తిప్పుకుంది. రెండవ ప్రదర్శనలో ఆలోపాలు సవరించబడ్డాయి.

'కన్యాశుల్కం' శ్రవ్యకావ్యమేగాని దృశ్యకావ్యం కాదన్న విమర్శ చాలాకాలంనుండి వినవస్తోంది. మవలంకర్ హాల్లో కిటకిట లాడుతూ కూర్చుని, ప్రతిదృశ్యంలోని ప్రతి కదలికను స్పందించిన అశేష జనసందోహమే ఆ విమర్శకు తిరుగులేని జవాబు. బహుశా ఎక్కువమందికి జ్ఞాపకం ఉండి ఉండకపోవచ్చు. కాని ఆ విమర్శకు అసలు ఆస్కారం లేకుండా 1944 లోనే చేశారు. ఒకనాడు నాటక రంగస్థలాకాశాన మిరిమిట్లు గొలుపుతూ వెలిగిన ప్రఖ్యాత కళాకారుడు డా॥ రాజారావు, ఆంధ్ర అభ్యుదయ రచయితల ప్రథమ మహాసభల సందర్భంగా ఇదే నాటకాన్ని తన దర్శకత్వంలో విజయవంతంగా ప్రదర్శించారు. మధ్య కాలంలో ప్రజలు మర్చిపోవటంతో, ప్రయత్నించే కళాకారులు లేకపోవటంతో ఆ విమర్శ తిరిగి తలయెత్తింది.

ఈ ప్రదర్శన ఢిల్లీ తెలుగు ప్రజలలో ఒక పెద్ద సంచలనాన్ని కలిగించింది.

నవంబరు 30, 1975 న దక్షిణ ఢిల్లీ ఆంధ్ర సంఘంవారు గురజాడపై ఏర్పరచిన పండిత గోష్ఠి, ప్రదర్శనం దృశ్యాలు.

గోష్ఠిలో మాట్లాడుతున్న
శ్రీ చంద్ర రాజేశ్వరరావు.
కూర్చున్నవారు శ్రీ తాతాచారి,
డా. రత్నం, డా. పాండురంగారావు,
శ్రీ బుర్రా వెంకటప్పయ్య





గోష్ఠిలో మాట్లాడుతున్న
శ్రీ బుర్రా వెంకటప్పయ్యగారు

గురజాడ తైలవర్ణచిత్రాన్ని
ఆవిష్కరిస్తున్న
శ్రీ చంద్ర రాజేశ్వరరావు



## దక్షిణ ఢిల్లీ ఆంధ్ర సంఘంవారు ప్రదర్శించిన 'కన్యాశుల్కం' నాటకంలోని దృశ్యాలు



శిష్యుడికి లుబ్ధుడికి పెళ్ళి రాయబారాలు
శిష్యుడు, కరటకశాస్త్రి,
రామప్పంతులు, మధురవాణి



"మాటవరసకు మనం పెళ్ళాడామనుకో,
వదినా" అంటున్న గిరీశం, బుచ్చమ్మ,
వెంకటేశం



హ్రాం, హ్రీం, హ్రూం అంటున్న
పూజారి గవరయ్య, లుబ్ధావధానులు,
మీనాక్షి, రామప్పంతులు



మధురవాణి, రామప్పంతులు "పిల్లా! అగ్గిపుల్లా" దృశ్యంలో



'కన్యాశుల్కం' నాటక బృందంతో శ్రీ తాతాచారి, శ్రీ బుర్రా వెంకటప్పయ్య ప్రభృతులు.

1935 లో ఆంధ్ర విశ్వవిద్యాలయంలో ప్రఖ్యాత కవి, ప్రయోక్త
శ్రీ అబ్బూరి రామకృష్ణారావుగారి ఆధ్వర్యంలో మొదటిసారిగా 'కన్యాశుల్కం'
నాటకం ప్రదర్శించబడినది. దానిలో దృశ్యాలు







**An Artist's Concept of a Modern Stage-Decor for 'Kanyasulkam'**

# వీరేశలింగం అగ్నిపర్వతం - గురజాడ మేరుపర్వతం

## ఢిల్లీలో గురజాడ అప్పారావు వర్థంత్యుత్సవం

దక్షిణ ఢిల్లీ ఆంధ్ర సంఘంవారు గురజాడవారి 60 వ వర్ధంతి సెపంబరు 30 వ తేదీన "ప్యారేలాల్ భవన్‌లో" వైభవంగా జరిపారు.

గురజాడవారి రచనలు ఫొటోలుగల ప్రదర్శన, పండిత గోష్ఠి, కన్యాశుల్కం నాటక ప్రదర్శన యీ కార్యక్రమంయొక్క ప్రధానాంశములు-

ఉదయం 10 గంటలకు భారత కమ్యూనిస్టుపార్టీ ప్రధాన కార్యదర్శి శ్రీ చంద్ర రాజేశ్వరరావుగారు గురజాడ తైలవర్ణ చిత్రాన్ని ఆవిష్కరించి కార్యక్రమం ప్రారంభించారు. వారు మాట్లాడుతూ సాంఘిక దురాచారాలను స్త్రీల బానిసత్వానికీ, మత దురహంకారానికీ వ్యతిరేకంగా అవిరామంగా పోరాడిన మహా మనీషి 'గురజాడ' అన్నారు. ఆయన మానవతా వాదుల్లో అగ్రగామి. కన్యాశుల్కం నాటకం ద్వారా ఆనాటి దురాచారాలపై ధ్వజమెత్తారు. "దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్" అని 80 సంవత్సరాలనాడు గురజాడచెప్పిన మాటలు ఆనాడూ ఈనాడూ ఒకే ప్రాముఖ్యతను కలిగివున్నాయన్నారు. అవి నిత్యనూతనాలు. ఆయన తెలుగుజాతి భవిష్యత్తును గురించి బంగారు కలలు కంటూ "వెనుకబడితే వెనుకేనోయ్" అని వెన్నుతట్టి జాతిని మేల్కొలిపారు. ఐక్యతను సమతను ప్రబోధించారు. అట్టి గురజాడ జన్మభూమిలో వేర్పాటు ఉద్యమాలు తలెత్తడం విచారకరం. జాతి పురోభివృద్ధికి జాతీయాభిమానం వుండాలని, అభిమానం దురభిమానం వేరు వేరని దురభిమానం మంచిదికాదని చెప్పారు. జాతీయాభిమానం పెంపొందించుకోవడం నేర్చుకోవాలన్నారు. ఈనాటికీ గురజాడవారి బోధల ప్రాముఖ్యత తగ్గలేదని వాటి స్థాయికి మనం పోగల్గితే ప్రగతిని సాధించగలమని చెప్పారు.

ప్రదర్శనలోని చిత్రాలను ఎంతో నైపుణ్యంతో చిత్రించి ఉత్తమ కళాకారుడు శ్రీ హెచ్. ఎ. శర్మగారు ప్రదర్శనకు ఎంతో శోభను చేకూర్చారు. దక్షిణ ఢిల్లీ ఆంధ్ర సంఘం అధ్యక్షులు శ్రీ సి. వి. యస్. రత్నంగారు సభాసదులను ఆహ్వానిస్తూ సంఘ కార్యకలాపాలను వివరించారు. గోష్ఠిని ప్రారంభిస్తూ ఢిల్లీ హైకోర్టు ప్రధాన న్యాయమూర్తి శ్రీ తాతాచారిగారు యిలా అన్నారు- "నేను విజయనగరం వాసిని, అప్పారావుగారి కుమారుడు రామదాసుగారితో అనేక పర్యాయాలు చర్చించడం ద్వారా వారి గురించి నేను

చాలా తెలుసుకున్నాము. ఆరోజుల్లో ఒక్క విజయ నగరంలోనే సంవత్సరానికి నూటనలుబది నాలుగు (144) బాల్య వివాహాలు జరగడంలాంటి దురాచారాలు చూసి అప్పారావుగారు వుద్వేగం చెందారు. ఆనాటి సాంఘిక దురాచారాలపై తిరుగుబాటు చేశారు. తమ అభిప్రాయాలు ప్రజలకు అందించడానికి తమ రచన లను మంచి సాధనంగా వుపయోగించారు. వాడుక భాషలోనే సాహిత్యం వుండాలనే వారి ఆశయం సాధించగలిగారు. విజయనగరంలోని బొంపలదిబ్బను గురించి జ్ఞాపకం వస్తుంది. ఆ రోజుల్లో అచ్చట మేధావులు యిలాంటి అనేక విషయాలు చర్చించే వారు. ఆనాటి చర్చలు ఈనాటి సభల్లో చర్చనీయాం శాలు కావడం నాకెంతో ఆనందంగా వుంది" అంటూ ముగించారు.

తరువాత శ్రీ బుర్రా వెంకటప్పయ్యగారు మాట్లా డుతూ గురజాడ ప్రతి రచనా ప్రయోజనాత్మకమైన దన్నారు. గురజాడ రచనలపై యింగ్లీషు భాషా ప్రభావం గురించి ముచ్చటించి మరింత పరిశోధన జరగాలన్నారు. బెంగాలీ సాహిత్యంతో గూడ వారికి పరిచయం వుండనీ, దేశంలోని సమకాలీన రచయిత లతో సంబంధాలు వుండేవనీ, సాహిత్యంలోనేగాక అనేక రంగాలలో కృషిచేశారనీ చెప్పారు. ఛంద స్సులో అవసరమైన మార్పులు నిస్సంకోచంగాచేసి ప్రజల భాషకు అనుగుణ్యంగా కవిత్వాన్ని మలిచు కున్నారనీ, తెలుగు భాషలో అతనే నూతన ప్రక్రి యలను ప్రవేశపెట్టిన ఘనత ఆయనదని, వీరేశ లింగం అగ్నిపర్వతమైతే గురజాడ మేరు పర్వాత మనీ యుచిత రచనలు అర్థంచేసుకోవాలంటే ఆయన వ్యక్తిత్వం సమకాలీన పరిస్థితులు గురించి మరింత పూర్తిగా పరిశోధన జరగాలన్నారు.

డాక్టరు యిలపావులూరి పాండురంగారావుగారు కవిగా గురజాడ విశిష్టతను తమ తియ్యటి తేట తెలుగులో వివరిస్తూ, వీరేశలింగంగారు మహాపురుషు లనీ, గిడుగువారు మహాపండితులనీ, గురజాడ మహా కవియనీ నార్ల వెంకటేశ్వరరావు చెప్పిన మాటలు సభకు గుర్తుచేశారు. అశుభంగా భావించబడే తోక చుక్కను భావితరాలవారికి వేగుచుక్కగా చిత్రించిన గురజాడ పురోగమన దృక్పథాన్ని కీర్తించారు. "దేశ మును ప్రేమించుమన్నా, మంచిఅన్నది పెంచుమన్నా" అని చెప్పడంతో కవిత్వమేగాక ఎంతో గొప్పభావన యిమిడివుందన్నారు. దేశము, ప్రేమ, మంచి అనే మూడు ఉదాత్తభావాలను వాటి ప్రగాఢతను వివరిం చారు. తెలుగు భాషా సౌందర్యం బాగా ఎరిగినవాడు అప్పారావుగారనీ, బెంగాలీ భాషా యింగ్లీషు బాగా తెలి సినందునే ఆయన తెలుగు భాష విశిష్టతను బోధ పరచుకున్నారనీ, ఛందస్సులో అప్పారావుగారు ప్రవేశపెట్టిన మార్పులు యీ విషయాన్ని నిరూపిస్తు న్నాయనీ సోదాహరణంగా వివరించారు. అనేక భాషలకంటే తెలుగుభాష చాల యింపైనది. గుర జాడను 'మహాకవి' 'కవి' అనడంకంటే 'కవయిత' అనడం సముచితంగా వుంటుందన్నారు. 'కవయిత' అంటే రచనలు చేయించేవాడు. ఆయన చేసిన కొద్ది పాటి రచనలే తరువాత అనేకమంది కవులకు మార్గ దర్శకాలయ్యాయి. ఆయన 'రచయితలను రచించిన రచయిత' అని చెప్పడం సబబుగా వుంటుంది. ఈనాడు ఆయన వర్ధంతి జరుపుకుంటున్నామంటే అర్థం వారి ఆశయాలు మరింత వర్ధిల్లాలని కోరుకోవ టమే. వారి ఆశయాలను వర్ణించడంగాక కొంతవర కైనా ఆచరించగల్గితే మనం పురోగమించగలం అంటూ ముగించారు.

ప్రముఖ రచయిత్రి శ్రీమతి వి. యస్. రమాదేవి స్త్రీ విమోచనకు గురజాడవారు ఆనాడు ఎంత కృషి చేశారో ఈనాడూ అంత కృషి చేయవలసిన ఆవశ్యకత వున్నదనీ, స్త్రీలను గృహసంబంధమైన వెట్టిచాకిరీ నుండి విముక్తులను చేయాలనీ, గురజాడవారి స్త్రీ పాత్రలు మానసిక విమోచన కలిగిన పాత్రలనీ, గిరీశం నలుగురూ అనుకున్నటువంటి దుర్మార్గుడు కాడనీ, మాటలను చేతలలో చూపలేని అశక్తతకి ప్రతిబింబమనీ ఆ అశక్తతకు విరుగుడే సౌజన్యారావనీ చెప్పారు. గురజాడ నిబద్ధ (కమిటెడ్) రచయిత కాదనీ, ఆయన ప్రబోధ సాహిత్యం తప్ప ప్రచార సాహిత్యం వ్రాయలేదనీ చెప్పారు.

శ్రీ హెచ్. వి. శర్మగారు కన్యాశుల్కం నాటక కళ గురించి వాదుకలోవున్న విమర్శలను సమీక్షించి దానిలోని నాటకీయతను, విశ్వసాహితిలోనే దానికిగల ఔన్నత్యాన్నీ విపులీకరిస్తూ పత్రం చదివారు.

శ్రీ టి. రామచంద్రరావు 'గురజాడ దేశభక్తి' అనే అంశముపై అమెరికన్ పరిశోధకులు శ్రీ డాన్ మేట్సన్ వ్రాసిన పత్రాన్ని చదివారు. శ్రీమతి కె. రాజేశ్వరిగారు గురజాడ తెలుగు సాహిత్యానికి అరుణోదయమన్నారు. శ్రీ యం. రాజేశ్వరరావుగారు గురజాడ నిబద్ధిత (కమిటెడ్) రచయితే అన్నారు.

సంస్థ సహాయ కార్యదర్శి శ్రీ యం. పాండురంగారావుగారు వందనసమర్పణ చేశారు. సాయంత్రం దక్షిణ ఢిల్లీ ఆంధ్ర సంఘంవారు శ్రీ సముద్రాల గోపాలమూర్తిగారి దర్శకత్వాన "కన్యాశుల్కం" నాటకాన్ని జనరంజకంగా ప్రదర్శించి గురజాడ అప్పారావుగారికి తమ శ్రద్ధాంజలి ఘటించారు. ●

—జయశ్రీ, 17-12-75.

# CHAND CHHAP UREA



## A FARMER'S BEST FRIEND

Serving the agricultural sector of the country is a responsibility that we take very seriously.

IEL's Chand Chhap Urea is manufactured under strict quality control measures to ensure that every bag of urea comes upto the same specified standard.

IEL's team of well qualified Agronomists give free Farm Advisory service to the farmers. This includes soil testing and balanced fertilizer recommendations, conducting field demonstrations and a number of other services to educate the farmer and initiate him in scientific farming.




**INDIAN EXPLOSIVES LIMITED.**
FERTILISER DIVISION

FDS/IEL/15